# చిన్న మనవి.

నాటకరచనలో చాల తక్కువపరిచయమున్న వాడనై నప్పటికి గురుదేవులు పూజ్యులు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు తొలిపలుకుతోను కవితల్లజులు శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణగార్లు సదభిప్రాయముల తోను ప్రోత్సహించి ఆశీర్వదించినందులకు నాకృతజ్ఞతా పూర్వకవందనములు. తొలిప్రయత్నములో దొరలిన లోపము లేమున్నా కళాభిజ్ఞులు తెలియపఱచినచో మలిముద్రణలో సవరణచేసుకొందును. అన్నివిధముల నన్ను ప్రోత్సహించిన శ్రీ టి. ఆర్. స్వామి, శివరావు, మాధవరావు, వరదం, శాస్త్రి గార్లకు ప్రణామములు.

రచయిత

1

# తొలిపలుకు.

కుర్చీలాగో గుమ్మడికాయలాగో చతికిలపడదు ప్రాణి. నడుస్తుంది; పరుగెత్తుతుంది; ఎగురుతుంది. పలుకుతుంది; పలకరిస్తుంది. పాడుతుంది; పాడిస్తుంది. ఎప్పుడూ ఏదోచేస్తూ ఉంటుంది; గోరీలాగ 'ఘోరం'గా నిద్రపోదు. పాపం! ప్రాణి ప్రాణం ఉన్నదాయను!

ఇంక అన్నిప్రాణులు ఒక్కలాగే అనుకోవు, అనవు, అనుభవించవు, ఆచరించవు.

విక్టర్ హ్యూగో అంటాడుకదా 'Drama is life and life is everything' అని. సమాజంలోకనపడే సార్థకమైన జీవితఖండాలని రంగస్థలంమీద పారేస్తాడు నాటకకర్త. ఎటొచ్చీ, వాటిని ఒకదానిలోకి ఒకటి మలుచుకుపోయేట్లు జాగ్రత్తగా కట్టడం అంతా ఒక కళాదృష్టితోపట్టి మనకు ఎదురుగాపెట్టడం చేస్తాడు. అందుకనే ఇతరకావ్యకర్తలకంటె నాటకంవ్రాసేవాడు ఎక్కువ సాంఘికజీవి (Social being) అని ఒక తత్త్వవేత్త అంటాడు; Comedies వ్రాసేవాడు మరీని; Satires (హేళనకావ్యాలు లేక వికటకావ్యాలు) వ్రాసేవాడు ఇంకానూ.

కొన్ని నాటకాల్లో మనుష్యులుకారు పాత్రలు, అభిప్రాయాలు. మరికొన్ని నాటకాల్లో మనుష్యులుకారు, హృదయ

భావాలు. వాటిలో ఒక్కొక్కొంతుకే దమ్ముపట్టి చివరదాకా గట్టిగామాట్లాడుతుంది. చాలానాటకాల్లో అవి ఉండవు. వట్టి మట్టిముద్దలుంటాయి; అవన్నీ ఒక్కలాగే కూడాఉంటాయి.

"ప్రణయసమ్రాట్"లో ప్రాణమూఉంది; వైవిధ్యమూ (Variety) ఉంది. ఈనాటకంలోవచ్చే పదిమందీ బ్రతికిఉన్న వాళ్ళూ రకరకాలుగా బ్రతికేవాళ్ళూ కూడా. ప్రదర్శించే నాటకం బాగుంది అనిపించుకోడానికి అది చాలదూ ? ఎటొచ్చీ, ఈ పదిమందిన్నీ జీవితంలోని లోతులూ ఎత్తులూ అందుకోరు. ఒక ఉద్వేగం, ఒక ఉత్సాహం, ఒక పొంగు (Irrepressibility) వీళ్ళందర్నీ ఆవహించి జీవితం పైపైనే తేలించి గంతులు వేయిస్తూన్నట్లు ఉంటుంది. దీనికి కారణం కొంతవరకూ ప్రస్తుతకాల లక్షణం కావచ్చు; కొంత వరకూ కావ్యవస్తువుకావచ్చు; కొంతవరకూ యౌవనప్రారంభ దశలోనే కవి ఉండడంకావచ్చు.

ఈ నాటకంలో మరోమంచి లక్షణం ఉంది. దీనిలో వచ్చే పాత్రలు గ్రంధకర్త ఎరిగిఉన్న ప్రత్యేకవ్యక్తులుకారు. అందరూఎరిగిఉన్న ప్రత్యేకవ్యక్తులుగా కనిపించేవమూనాలు. (individuals and types) పోప్ వ్రాసిన హేళన కావ్యాల్లో మొదటిరకంవాళ్ళే వస్తారనిన్నీ, డ్రైడన్ వ్రాసిన వాటిలో రెండోరకపువాళ్ళు వస్తారనిన్నీ, డ్రైడన్ కవిదే ఎక్కువ ఉచితమూ ఉత్కృష్టమూ అయిన పద్ధతి అనిన్నీ,

తెలుసున్నవాళ్ళు అంటారు. వీరేశలింగంపంతులుగారి ప్రహసనాలకి గురజాడ అప్పారావుగారి నాటకాలకి అటువంటి తేడావే ఉందనుకుంటాను. పంతులుగారి ప్రహసనాలు ఆరోజులూ పరిచితులైన ఆ వ్యక్తులూ ఆ చోట్లూ దాటివస్తే నిలపడవు. అప్పారావుగారిది గొప్పశక్తి; మంచి ప్రతిభ; "కన్యాశుల్కం" లోది ఎక్కువ ఉత్కృష్టమైన కళ.

ఇంక ప్రత్యుత్తమకావ్యానికిలాగే సెటైర్సుకి మరో మంచిలక్షణం ఉండాలి. పరిచితుడైన ప్రత్యేకవ్యక్తినే కవి తీసుకుంటే, హేళనచేసినప్పుడు కవిలో క్రౌర్యం కనపడుతుంది; హేళన చేయబడ్డ వ్యక్తిలో ఆగ్రహమూ ద్వేషమూ పుడతాయి. నాటకంచదివినవారిలో కూడా విరక్తీ వెగటూ కొంతవరకు కోపమూ కల్గుతాయి. ప్రహసనానికి ఫలితంగా మాననష్టపు దావా రాకూడదు. గిరీశమే "కన్యాశుల్కం" చదివినా మనలాగే ఆనందిస్తాడు; మనలాగే వ్యక్తులవీ సమాజాలవీ లోపాలు గుర్తిస్తాడు. ఇంక కవి అనురాగం ఎటువంటిదో చూడండి! గిరీశాన్ని జైలులో పెట్టించడమో కొరత వేయించడమో చెయ్యలేదు. 'కథ అడ్డం తిరిగిం' దంటాడు. 'ఏమో ముందు ఎలాగ కొట్టుకొస్తాడో ఈలోకంలో'' అని ఆత్రతగానూ ఆశగానూ మనం అనుకుంటాం. ప్రేమార్ద్రమైన కవిద్రష్ట; యాత్రామార్గం చిన్నా అందర్నీ అనురులుగానే చూస్తా డతడు. 'నువ్వు చెడ్డవాడవు కనుక నీకు ఉరిశిక్ష' అనివిధించే అంధుడు

కా డతడు. ఏ ఒక ఇద్దర్నో తీసేస్తే లోకంలో అందర్లోనూ సమానంగా మంచిచెడ్డలున్నాయని నాకు తోస్తుంటుంది. భారతం అంతాచదివాక శకుని ఎక్కువమంచివాడో ధర్మరాజు ఎక్కువమంచివాడో నేను నిర్ణయించలేను. అర్జునుడూ కర్ణుడూ కూడా స్మశానంలో సగంచిక్కినట్టూ స్వర్గానికి సగం ఎక్కినట్టూ కనబడతారు. ఇదిమాత్రం నిజం; శకుని, కర్ణుడు దుశ్శాసనుడు లేని భారతలోకం ఏమంత బాగుంటుంది! మనం అందరమూ ఈ లోకంలో లేకపోతే ఈ బ్రతుకికి రుచీ సచీ ఏమిటి?

ఆనటోల్ ఫ్రాన్సు కాబోలు బాగా అంటాడు, "నాకావ్యాల్లో ఈ హేళన పరిహాసం అనేది నేను ఉపయోగించకపోతే ఈలోకంలో ఎందరోవ్యక్తుల్ని ద్వేషించేటంత బలహీనుణ్ణి అయిపోయి ఉందును" అని. కనుక కవికి విశాలమైన ప్రేమ ఉండాలి. ఇంక మహాకవులకి ఉండే కరుణావేశమూ ఉదాత్తప్రేమా అనలేను కాని ఈగ్రంథకర్తని ఆవహించినది మంచిలక్ష్యాలు కలిగిన యువజనులకు సామాన్యమైన స్నేహబుద్ధి; నిష్కల్మషమైనదీ, ఆర్ద్రమైనదీని.

ఈ గ్రంథకర్త 'గోజ్' నీ డైరెక్టరు విశ్వనాథాన్నీ తన్నించడమో, కూనీ చేయించడమో చెయ్యలేదు. వాళ్లిద్దరిమధ్యకీ వచ్చి వాళ్లనివిడగొట్టి సంతృప్తిపడేటంత అసహనం చూపించలేదు. వాళ్లు అలాగకలిసి ఉండడమో చితికిపోవడమో వాళ్లకే

వదిలేశాడు. కాక నిజానికి ఎవరేమి చేయగలరు కూడా! ఇతనికి తననాటకంలో వచ్చేవాళ్లందరిమీదా ఇష్టమే! 'జులు' అంటే ప్రత్యేకంగా! జులు 'హామ్' ఏమో కూడా! గ్రంథకర్తని, నరసింహాన్ని, స్నేహితులు హామ్ అంటారు.

ఇక రెండు మాటలు. దీనిలో వచ్చే పాత్రలు—ప్రేమ్జీ వంటివాళ్లు—సరిగ్గా అలాగే మాట్లాడతారా, అటువంటి పనులే చేస్తారా అని మనం అడగకూడదు. అనడంలోనూ, చేయడంలోనూ కొంత విలక్షణత కొంత ఎక్కువ చేయడం ఉంటేనే కాని నాటకంలో రుచీ ఆకర్షణా ఉండవు. సంభాషణ చురుకుగా నడిచింది. జనాంతికాలతో ఆత్మగతాలతో దీర్ఘప్రసంగాలతో కాలీడవలేదు. క్రొత్తక్రొత్త సంఘటనలుకూడా గమనతీవ్రత (tempo) కి సహాయపడ్డాయి. నాటకరచనకికూడ ఒక మహోద్దేశం ఉంది. పాత్రోన్మీలనం బాగుంది. శబ్దప్రయోగమూ, వాక్యనిర్మాణమూ ఇంకా బాగాచెయ్యొచ్చు.

నరసింహానికీ నాకూ ప్రియబంధాలు చాలా ఉన్నాయి. కాలేజీలో—అంటే, ఈ కాలపు కాలేజీలో—ట్యూటరు గురువుగారయితే నరసింహం నాశిష్యుడుగారు. ఇతనికి నేనంటే బోలెడు గురిమాత్రం ఉంది; అనురాగం మరీని. ఇక ఇతనితండ్రిగారు నాతండ్రిగారికి చాలాచాలా అపురూపైనశిష్యుడు. "మా శేషగిరి రావు రత్నం" అనేవారు నాతండ్రిగారు. శేషగిరిరావుగారు చిన్నతనంలోనే కొన్ని నవలలు వ్రాశారు. ఇంకో విశేషం. పరమ

పూజ్యులూ నాకు ఆప్తబంధువులూ అయిన 'కళాప్రపూర్ణ' శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారి మనమడుకూడా నరసింహం. అయితేనాకు ఇష్టుడైనవాడు కనుక ఈనాటకం బాగుందనడం లేదు నేను; ఈనాటకం బాగుందికనుక నాకుమరీ ఇష్టుడయ్యాడంటున్నాను.

సంక్రాంతి:
కాకినాడ.

దేవులపల్లి కృష్ణశాస్త్రి,
నవ్యసాహిత్యపరిషత్తు.

---

# అభిమతములు.

శ్రీమత్పరదేవతాయైనమః

## ప్రణయసమ్రాట్.

ఇది వ్యావహారికభాషలో ప్రణయ (ప్రేమ) తత్త్వమును నిర్దేశించుచు రచించినయొకవిధమైన క్రొత్తపోకడల రూపకము. ప్రాచీనులు చెప్పినలక్షణములకుఁ గట్టువడి వ్రాయవలయునని కవి తలంపుగాదు. కవి నూతనభాషా సంప్రదాయములయం దభిమానియగుటం జేసి తదనుసారముగా రచించెనని తోఁచెడిది. స్త్రీగాని పురుషుఁడుగాని ప్రేమను దుర్వినియోగము చేయరా దనియు, వివాహబంధమునకుఁ దమతమప్రేమ కట్టుఁబడి యుండ వలయుననియు, అట్లు కట్టుఁబడియున్నప్పుడే అది పవిత్రముగ నుండుననియు నిందలి సారాంశము. దీనిని జనువుకొలఁది చదువ వలెననియే యుండును. నేను చాలభాగము చదివించి వింటిని. హృదయంగమముగా నున్నది. ఈ గ్రంథకర్త నాశీర్వదించు చున్నాను.

క్షీరసాగరం,
బెజవాడ
24-11-43.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.

# ప్రణయసమ్రాట్.

'ప్రణయసమ్రాట్' నాటకము సమగ్రముగ సావధానముగ చదివినాను. ఆదినుంచి అంతంవరకూ ఏమాత్రం విసుగు లేకుండా ఇంపుగా నడిచింది. నాటకకర్త చాలావరకు నవీనవిధానము అవలంబించినట్లు కనపడుతూన్నది. స్వగతములు, ఆకాశపురాణములు, దీర్ఘప్రసంగాలు ఇందులో లేకపోవడం రచనానిపుణతను చాటుతోంది. పాత్రోన్మీలనం ప్రస్ఫుటంగా బాగుంది. మొత్తంమీద ఈనాటకం వికటకావ్యశ్రేణి (Satirical Skits)లో చేరుతుంది. ప్రేమపేరిట అయోగ్యులుచేసే హడావిడులు, అకార్యములు, విపరీతవిధానములు-సముచితప్రతిఫలములు సరసముగా నిరూపితములయినవి. స్త్రీపురుషులకు విశేషించి యువావస్థలో ఉన్నవారికి ఉత్తమజీవితలక్ష్యమును రూపకకర్త నిరూపించగలిగినాడు. ఇందులో సంభాషణలు నర్మగర్భములు నానారసోచితములు, హృద్యములు. ఆంగ్లేయపదములు, రంగములు బాగాతగ్గించితే ఇంకా సమీచీనమయేది. లోపము లేమున్నా నాటకం ప్రదర్శనయోగ్యం మొదలునుండీ తుదివరకు చమత్కారజనకము. రంగస్థలముమీద 'ప్రణయసమ్రాట్' రమణీయముగా నంటుందనడం నిర్వివాదం.

సాహితీసమితి,
జనవరి
౧౯౪౪

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి.

# ప్రణయ సమ్రాట్.

ఇది శ్రీకోట లక్ష్మీనరసింహము బి.ఏ, అపూర్వముగా వ్రాసిన ప్రణయప్రతిపాదక సాంఘికనాటకము ఇందు స్త్రీకి స్వాతంత్రమెంతవరకుండవలయునో, వివాహములేని ప్రేమసార్థకముకాదని నిరూపించుచూ, ముద్దులొలుకుశైలితో ప్రకృతి రామణీయకమును వెల్లడించుచు మానవలోకమునకు మనోహరత్వమాపాదించునట్లు కథాసంవిధానము సంతరింపబడినది. ఈ నడుమ రచింపబడుచుండు ఆధునికప్రణయ కావ్యములకును దీనికిని సమానత్వకల్పనము చేసినను చేయవచ్చునుగాని, యిది వానికన్న వేయిరెట్లు మిన్నయైయున్నదని చెప్పుచున్నాను. ఇప్పటిప్రపంచకములో యిట్టిమార్గమే, యిట్టిశైలియే యిట్టిసంవిధానమే లోకులకు రుచించుచున్నదిగావున యీనాటకము సర్వస్థలములయందు ప్రదర్శింపబడి సర్వజన మనోహరత్వమును గలిగించుగాకయని కోరుచున్నాను.

రాజమండ్రి,
26-11-43.

కవిసార్వభౌమ,
**శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.**

---

మీగ్రంథము చదివితిని. వస్తువుమంచిదే, స్త్రీలకాదర్శముగా వివాహము చేసుకొనుట మంచిదని. మీగ్రంథమంతయు హాస్యరసముతో నిండియున్నది. ప్రేక్షకులను నవ్వించివేయును. ఈకాలమున కిట్టినాటకములే కావలయును. మీరింకను మంచి కావ్యములువ్రాసి తెలుగుమాతను పూజింతురుగాక !

బెజవాడ,
6-12-43.

కవిసమ్రాట్,
**విశ్వనాథ సత్యనారాయణ.**

శ్రీ

# ప్రణయసమ్రాట్.

[వినూత్నసాంఘికం]

## పాత్రలు.

ప్రేమ్జీ: ప్రేమోపాసకుడు; స్వేచ్ఛాప్రణయసంఘ కార్యదర్శి; లక్ష్యంగా జీవించాలనుకుంటాడు.

జులు: ప్రేమ్జీ అంతరంగికమిత్రుడు; అసలైన సంస్కారి.

డై. విశ్వనాథ్: అజంతాస్టూడియోస్ దర్శకుడు.

క్రొమ్మన: అజంతాస్టూడియో కవి. శ్రీమతి మధురం మేనమామ.

జానకిరామ్: శ్రీమతి మధురంతండ్రి.

మధురం: జానకిరామ్‌గారి సుపుత్రిక. 'శ్రీమతి, పెళ్లొద్దు-పెళ్లొద్దు-కాలేజీకి ప్రిన్సిపాల్'.

రోజ్: రష్యాపర్యటనంచేసివచ్చిన నవయువతి.

[తోటమాలి, ఇద్దరు విద్యార్థులు]

కాలం: వర్తమానం.

వాతావరణం: పట్టణం.

కాలపరిమితి: ఒక పక్షంరోజుల్లో జరిగిన సంఘటన.

శ్రీ

# ప్ర ణ య సా మ్రా ట్.



## ప్ర థ మా ం క ము.

### ప్ర థ మ ర ం గ ము.

[స్థలం :—స్వేచ్ఛాప్రణయసంఘం గార్డెన్‌లో; తోటమాలి అప్పాయంతో పూలమొక్కలకు నీళ్ళతో దోహదంచేస్తూ]

"పూయవేనాచిట్టి పూవుసంపెంగా,
విరియకాయవె నేను ఈ విశ్వమంతా."

అని పాడుతూ ఎవరిదో అలజడి ఆలకించి పొదలచాటున పొంచి వుండును. శ్రీమతిరోజ్ 'ప్రణయమె జీవనసౌభాగ్యం' అని పాడుతూ, పూలచెండ్లను పల్కరిస్తూ, తదనుగుణంగా అభినయిస్తూ వుండగాప్రేమ్జీ ప్రవేశించి గానమాధుర్యంలో, రస తన్మయతలో, మైమరచి రెండవచరణం పూరించి, డ్యూయట్ పాడి సంభాషణలో దిగుతారు.

గానం.

ప్రణయమె జీవనసౌభాగ్యం
అగమ్యప్రేమే జీవితగమ్యం॥ ప్ర॥
ప్రణయడోలికల నూయలలూగే

సౌభాగ్యంబే అమృతతుల్యం
మనజీవితమంతా మధుభరితం॥ ప్ర॥
ప్రణయతంత్రుల ప్రణవనాదమె
విశ్వవిపంచీస్వనమో॥ ప్ర॥

ప్రేమ్జీ:—(ఆవేశంతో) రోజ్ ! కోకిలా !

రోజ్:—(ఆనందంతో) ప్రేమ్జీ ! (వికటంగా) ప్రేమ్జీ !

ప్రేమ్జీ:—(హృదయపూర్వకంగా) డార్లింగ్ ! ప్రేమమయీ! ఏమిసంగీతం ! ఏమిహాయి ! విశ్వవీణారవము మ్రోగి నట్లయింది, నీజీవనానందగీతి పాడుతుంటే.

రోజ్:—(హాస్యంగా) అబ్బా ! ఏమిపొగిడేస్తున్నారు! ఈ High Class తైర్పొయ్యడంలో మీకు మేతైరు సోదరులూ అందరు. అదీ మీప్రత్యేకత!

ప్రేమ్జీ:—నిజంగానే అంటున్నా-నాలో తియ్యనిబాధ రేకెత్తు తోంది.

రోజ్:—ఏమిటో, కారణం ?

ప్రేమ్జీ:—తెలియదు. ఏమైవుంటుందా అని ఆలోచిస్తున్నా.

రో:—పైత్యవికారమేమో.

ప్రే:—కాదు మధురమూర్తీ ! కాదు—నేనొకటి అడుగుతా; అదేమిటో చెప్పుకో చూద్దాం.

రో:—ఊ. అడగండి. ఆమాత్రం చెప్పుకోలేనా ?

ప్రే:—కోప్పడకు ప్రేయసీ! నువ్వు కళ్ళెర్రజేసావంటే ఈ ప్రేమదాసు భస్మం అయి వూరుకొంటాడు.

రో:—ఏమికబుర్లు నేర్చారండి! మరీవచ్చింది. ఈప్రేమోపాసకులకు వచ్చిన పెద్దరోగమే యిది.

ప్రే:—డియర్ రోజ్! అట్టే గట్టిగా ప్రళయంగా మాట్లాడావంటే నాకోమలహృదయం నీ లేతపాదాలక్రిందపడి నలిగిపోతుంది. ఉండు! ఉండు! ఆ కేక వినిపిస్తోందా?

రో:—(దిగ్భ్రమచెంది) ఎక్కడ?

ప్రే:—వినిపించడంలేదూ? హృదయం ఎలుగెత్తి చేయెత్తి పిలుస్తోంది. విను! ఆప్రణయవాణి సుధామధురగానం!

రో:—(రోజ్, ప్రేమ్జీహృదయందగ్గర చెవిపెట్టి వింటుంది) అవునవును...వినిపిస్తోంది. రేడియోలో ఏడ్చినట్లు మీ వెర్రిహృదయం నాచెవిలో ఘోరంగా ఏడుస్తోంది. అయ్యో పాపం! ఎలాగ?

ప్రే:—జీవిత వసంతాన్ని చేకూర్చే నీ చిరుపెదవుల కాంతితో ఒక్కసారి నాహృదయాన్ని కంపింపచేస్తే వూరుకుంటుంది.

రో:—అబ్బా! ఏమిఆశ! అడగండి. ఏమిటో మహా అడుగుతానన్నారు. కాని హస్కాలజీలో పడిపోయారు.

ప్రే:—(ప్రేమ దృక్కులను ప్రసరిస్తూ) దేవీ! నాహృదయాన్ని కలచివేస్తోంది. నూతనశోభను నాట్యంచేయి

స్తోంది. అబ్బబ్బా! ప్రణయాగ్ని జ్వాలలకు ఆహుతై పోతున్నా.

రో:—అరెరే! నాపాటకాబోలు! అవునా?

ప్రే:—ఊహూం. కాదు.

రో:—మాటా?

ప్రే:—కాదు. (ఆమె సౌందర్యాన్ని విలోకించి) నీ అమర సౌందర్యం! పోనీ యింకొకటి.

రో:—భావచాంచల్యమా?

ప్రే:—(నవ్వుతూ కళ్ళు, అన్నట్టు సూచించును.)

రో:—(ప్రశ్నార్థకంగా) చూపులా?

ప్రే:—ఆఁ, రోజ్! నీ నేత్రాంచలములనుండి అమృతధార స్రవిస్తోంది.

రో:—ఒహ్హో! అలాగా! (కళ్లు తడిమి చూచుకొనును.)

ప్రే:—మబ్బు తునకలచాటున సయాటములాడే మెరుపుతీగెలు నీ చూపులలో ప్రతిబింబిస్తున్నాయి. ఒహో! భగవంతుని అపూర్వకళాసృష్టి.

రో:—(చలోక్తిగా) మీకో... చిత్రవిచిత్రసృష్టి; విశ్వామిత్రసృష్టి టైపులో చేరుతారు.

ప్రే:—నీ అమృతవీక్ష వెన్నెలను విరియకాసేస్తోంది.

రో:—మీకలువరేకులవంటి కళ్ళు ప్రేమను కుంభవృష్టిగా కురిపిస్తున్నాయి.

ప్రే:—అహా! (కళ్ళనుద్దేశించి) అవి నిమీలితనేత్రాలు కావు.

రో:—ఇవి కళ్ళుకావూ? ఎవరైనా కళ్ళతో నవ్వగలరు.

ప్రే:—కావు. అతిలోకసౌందర్యానికి ఆటపట్టైన స్వర్గసీమకు సింహద్వారాలు.

రో:—(చిత్రంగా) ఏమిటీ అప్రదిష్ట. నాకళ్లను స్వర్గంలోవున్న ద్వారబంధపుచెక్కలతో పోల్చారా? ఏమి కవిత్వం అండి. నిరుపమానంగావుంది. మిమ్మల్ని ఒక చెట్టుగాను నన్నొక కొమ్మగాను వర్ణించకూడదూ? బాగుంటుంది.

ప్రే:—ఇంకా నెమ్మదిగా అంటావేమిటి. ఒకటోరకంగా వుంటుంది. నీ వొకకొమ్మవె. 'ఈ కొమ్మను చేకొమ్మ'అని దేవుడు నన్నాజ్ఞాపిస్తున్నాడు. ఆ విధిగా స్వీకరిస్తా.

రో:—ఓహో! ప్రేమ్జీకి Dr. Roy's pills వెయ్యవలసి వస్తుందేమో! అయినా ప్రేమోపాసకులు, భత్రాజులు, భావకవులు, సగోత్రులు, సపిండులు అనుకుంటా. ప్రేమ్జీ! మీరు అభినవ శ్రీనాథులయిపోయారే!

ప్రే:—(ఆవేశంతో) అబ్బా! ప్రేమమయి!

రో:—ఏమిటాగాభరా?

ప్రే:—నువ్వే నా ప్రపంచం! నా సర్వస్వం! నా జీవితలక్ష్యం! నా జీవితనౌక నీ ప్రేమవాహినిలో యవ్వనడోలికలపై నాట్యం చేస్తోంది. మనం పర్యటనం బయలుదేరి ప్రణయ

విహారంలో అజంతాగుహల అనుపమకళావిశిష్టతను దర్శించాలి. అమరశిల్పుల అమృతహస్తాలు నిర్మించిన ముగ్ధమోహన సౌందర్యరాశైన టాజ్‌మహాల్‌ను ఆరాధించాలి. ఆ జ్యోతిర్మయమందిరము షాజహాన్ ముంతాజ్ ల పవిత్రప్రేమ కొక అమూల్యచిహ్నమై ఆకల్పాంతం ధ్రువతారలా శోభిల్లుతుంది. ప్రేమోపాసకులకు అదొక పుణ్యక్షేత్రం.

రో:—తప్పకుండా వెళ్లుదాం, ప్రేమ్జీ. మనము World tour కూడా చెయ్యాలి.

ప్రే:—ఆఖరుకు మనపేరన్నా ప్రపంచయాత్ర చెయ్యాలి. రోజ్ ! కాష్మీర్ మన బృందావన సోయగాలతో విరజిమ్మివుంటుంది. అది భూతికస్వర్గం.

రో:—మీరోసారి వెళ్ళివచ్చారా ! Friends తో.

ప్రే:—లేదు. 'వినానార్యా నిష్ఫలం లోకయాత్ర' అన్నట్టు 'what's the earthly use of a journey without a woman' అన్నాడు. కనుక సఖీసమేతంగా వెళ్ళాలి.

రో:—స్వర్గానికి వెళ్ళినా విడాకులు తప్పవా ?

ప్రే:—(నిర్విణ్ణుడై) ఆఁ ఆఁ ఘోరం ! విడాకులా ! స్వర్గానికి వెళ్ళినా మనస్నేహం తప్పదా అనాలి. మనది అమర

ప్రేమ! తుచ్ఛవాంఛాప్రేరిత కామతృష్ణతోకూడిన పసు ప్రేమకాదు. అనంతప్రేమ, Divine love !

రో:—అబ్బా ! పోదురూ ! ఉదయాస్తమానం ఒకటే ప్రేమ గోల, ప్రేమఘోష అయితే యెలా బ్రతుకగలం చెప్పండి.

ప్రే:—(చెలోక్తిగా) చెప్పనా ? చెప్పేస్తున్నాను. కాసుకో మరి...మునీశ్వరులు గాలిపీల్చి బ్రతుకుతారు; ప్రేమోపాసకులు సౌందర్యాన్నిపీల్చి Prem-Ki-Bottle విప్పి ప్రణయసుధారసాన్ని తనివితీర గ్రోలి జీవిస్తారు.

రో:—ఏమైతేనేంగాని మొత్తంమీద ప్రేమసన్యాసు లెక్కువైపోయి Philosophy of love అమోఘంగా ప్రబోధిస్తూ, యువతీ యువకులను ప్రణయ మహాసముద్రంలో యింగన్లు కొట్టిస్తున్నారు.

ప్రే:—ప్రియతమ్ ! ప్రేమ వేదికమీద నిలబడి చెబుతున్నా—శూన్యప్రపంచానికి ప్రభాతాన్ని ప్రసాదించేది ప్రేమ! ఎడారిజీవితాలకు సమాజదార్ఢ్యంనుండి విముక్తినిచ్చి స్వర్గసౌఖ్యాన్ని చేకూర్చే Oasis ప్రేమ !

రో:—హరేరామ్ ! ఏం గొడవొచ్చిపోయిందండి ప్రేమోపాసకులతోటి ... నిల్చుంటే ప్రేమ; కూర్చుంటే ప్రేమ; పలకరిస్తే ప్రేమ; పలవరిస్తే ప్రేమ; ఆలోచిస్తే ప్రేమ; ఆవలిస్తే ప్రేమ.

ప్రే:—ప్రేమ అన్నందుకే నామీద 'విమర్శనదాడి'కి బయలు దేరి నువ్వే ప్రేమ-టెక్నిక్ మీద చిన్న ఆపరేషన్ చెక్కేసావు. Most dramatic Rose!.

రో:—సరేకాని ఇంకా కాశ్మీర్ విశేషాలు ఏమైనా చెప్పండి, Railway Guide గారు.

ప్రే—ఏముంటాయి విశేషాలు మహా... ఈ గరల్ గైడ్ వారికి శ్రీవారు అంగరక్ష అని.

రో:—(చటాలున కరుగ్గా) మీరు నాకూ నాస్వేచ్ఛకి Body Guard అన్నమాట.

ప్రే:—(ప్రేమాతిరేకంలో') రోజ్! గాలికౌగిళ్ళనలిగిపోయే కుసుమగుచ్ఛాలు ఆపాదరిండ్ల చాటునా, మాటునా నక్కి ఒండొరులతో హేవాకకేళిలో ముద్దాడుతూ వున్నాయి! ప్రణయలీలాభంగిమాలకనువుగా ప్రసూన నృత్యం చేస్తున్నాయి! అదంతా నేత్రపర్వంగా వుంటుంది!

రో:—అబ్బా! నిజంగా!

ప్రే:—(ప్రణయరసతన్మయతలో) నిజంగా అక్కడ Everest Hotel పై అంతస్తులో ఆ గ్లాసుఛైర్స్‌లో కూర్చుని ఆ వెలుగులో వెలుగై, లీనమై ప్రణయరసతన్మయతలో నీవు-నా-ఒడిలో-రోజ్ నేను 'Omar khayyam' ని నువ్వు నా 'రోజ్‌ఘటం'.

[ఇంతట్లో తోటమాలి వెంకన్న అలికిడి వినబడి రోజ్ పారిపోవును. తరువాత ప్రేమ్జీ నిష్క్రమించును. అప్పుడు తోటమాలి "పెనయమె జీవనసౌభాగ్యం-అగ మ్మపేమే జీవితగోమయం" అని రోజ్‌ని అనుకరిస్తూ స్త్రీ భంగిమాలతో పాడుతూ మధ్యమధ్య ఆకాశంకేసి చూస్తూ క్రోటన్సు మొక్కలికి నీళ్ళు పోస్తుండగా మిష్టర్ జులూ ప్రవేశం.]

జులూ:—వెంకన్నా! వెంకన్నా! ఓరి నీపాట ముండామొయ్యా! ఏంచేస్తున్నావురా?

వెం:—నాను పాడుతూంటే పిట్టులు సూస్తున్నారుగా బాబూ! పైగా అడుగుతారేటి? ఏం బాబూ! ఏటి సెలవు?

జులూ:—ప్రేమ్జీగారిలా వచ్చారా?

వెం:—ఆఁ—సిత్తం-రాలేదండి.

జులూ:—ఇప్పుడేకదూ 'ఊఁ'.అన్నావ్-మళ్లీ ఇంతట్లోనే అబద్ధాలా?

వెం:—సిత్తం. రాలేదండి. ఒక్కరూ రాలేదండి...

జులూ:—ఓరి నిన్నుతగలెయ్యా! చంపేశావురా! నీ హాస్యం మండా! ఒక్కరూ రాలేదూ...ఇద్దరు వచ్చారన్న మాట. ఎవరా ప్రముఖులు?

వెం:—పేంజీగోరండీ. (చేతులు నులుపుకుంటూ) పేంజీగారూ.

జులూ:—ఊఁ ప్రేమ్జీగారూ ?

వెం:—"పెనయమె జీవనసౌభాగ్యం" [అని చేతులు స్త్రీవలె తిప్పుకుంటూ అభినయించును]

జులూ:—అమ్మగారెవరో దయచేశారన్నమాట. ఇంకనే ? చెప్పు త్వరలో.

వెం:—పేంజీగోరూ రోజూ అమ్మగో రండీ ... ఇద్దరూ...

జులూ:—ఆఁ ఇద్దరూ...?

వెం:—ఇలాగిలాగ ఆడుతూ పాడుతూ...

జులూ:—ఛీ ! వెధవా ! ఈబేడ పుచ్చుకుని చుట్టముక్కలు కొనుక్కో పో...

వెం:—సిత్తం! సిత్తం! అనుగ్రించారు పెబువులు (పెనయమె జీవనసౌభాగ్యం అంటూ నిష్క్రి.)

జులూ:—[తీక్ష్ణంగా] అయితే-ప్రేమ్జీ రోజుల ప్రణయం-వన విహారం-ఇత్యాదులు జరిగేయని తేలింది. ప్రేమ్జీ రోజంటె గాఢంగా, తీవ్రంగా ప్రేమించేస్తున్నాడన్న మాట ! కథ పట్టు దొరికింది.

(జులూ నిష్క్రి... తెర.)

---

ద్వితీయ రంగము.

[స్థలం:—శ్రీమతి మధురం యిల్లు. రౌండ్ టేబిల్, ఫ్లవర్ వేస్ మూడుసోఫాలు, కొన్ని నవ్యసాహిత్య గ్రంధాలు, గతించిన మధురం తల్లియొక్క చిత్రపటము, బృందావనములో గోపికావృతమైన కృష్ణునిచిత్రం వైపుచూస్తూమధురం భావగీతం పాడును.]

(శ్రీ క్రొమ్మన ప్రవేశించి ఒక క్షణంతాళి, దగ్గును.)

మధు:—ఓహో! మావయ్యేమిటి? ఎన్నాళ్ళకి దర్శనం యిచ్చారు. పైగా దొంగచాటుగా వినడం.

క్రొ:—(ఆసీనుడై) వినడం లేదు. ఇప్పుడే వస్తున్నా.

మధు:—ఓహో! అవును. తగు పెద్దమనుష్యులు, అందులోను స్టూడియో కవులు.

క్రొ:—అయితే మధురం! నాన్నగారు ఇంట్లో లేరా ఏమిటి? ఉన్న అలికిడి లేకపోతేను.

మధు:—నాన్నగారు... ఊళ్లోనే లేరు.

క్రొ:—అయితే... పెళ్లి సమ్మంధం యేమైనా...

మధు:—ఆఁ అదే. అలాంటిదే...

క్రొ:—ఏమిటో ఆయన వెర్రికాని... అల్లుడికోసం దేశం అంతా బైరాగిటిక్కట్టు కొనుక్కొని గాలించి వదలిపెడు తున్నాడు. ఇంతకీ...

మధు:—ఆయన వుద్దేశ్యం కొనసాగదు.

ప్రకా:—మధూ ! నువ్వింకా చిన్నపిల్లవు. ప్రపంచకానుభవము తక్కువ. ఇప్పటికారుపిల్లల కీపత్తి తొందరతప్ప దూర దృష్టి వుండదు. ముందు వెనుకలు గుర్తించరు. ఆపాల పొంగు రోంత చల్లారాక పశ్చాత్తాప పడతారు. మీ అమ్మ నీకొక మంచి సంబంధం చూసి నిన్నొక యింటి దాన్ని చెయ్యవలసిందిగా మీనాన్న చేత, నాచేత చేతిలో చెయ్యివేయించుకొని మరీ ప్రాణం వొదిలింది.

మధు:—పాపం ! అమాయికత్వం—మాదురదృష్టం.

ప్రకా:—నీమొండితనం మీ అమ్మకు తెలుసునుగా.

మధు:—పోలిక లెక్కడికిపోతాయి, మామయ్యా !

ప్రకా:—అరెరే ! అన్నట్టు చెప్పడం మరచిపోయాను. మన స్వేచ్ఛాప్రణయసంఘకార్యదర్శియిన ప్రేమ్జీ...

మధు:—ప్రేమ్జీ ?

ప్రకా:—ఒకపనిమీద నిన్ను కలుసుకొనేటందు కొస్తానన్నారు. ఈపాటికి వచ్చేటైమయింది...... (మధు నుద్దేశించి) ఏమిటో ఆలోచిస్తున్నట్టున్నావు ?

మధు:—అబ్బే ! ఏమీలేదు. ఆపని ఏమైవుంటుంది చెప్మా అని.

క్రో:—వారే నీతో స్వయంగా ముచ్చటించాలట.

(ఇంతలో 'కవిగారూ' అని ప్రేమ్జీ పిలువగా క్రొమ్మన సగౌరవంగా ప్రేమ్జీని లోనికికొనివచ్చును.)

క్రో:—(ప్రేమ్జీవైపు తిరిగి, మధునుద్దేశించి) వీరు ప్రేమ్జీ, సౌందర్యోపాసకులు! ప్రేమోపాసనకూడావుంది. Free love society కార్యదర్శి. నామిత్రులు...Sorry మన మిత్రకోటిలోనివారు.

మధు:—నమస్తే! నేడు చాలా సుదినం.

ప్రే:—(ముక్తసరిగా) Thanks! మీ దర్శనభాగ్యం లభించింది.

క్రో:—ప్రేమ్జీ! ఈమె మామేనకోడలు; మొన్న సెప్టెంబరులో చివరికి బి. ఏ. పేసయింది. ఉన్నతాశయాలుగల పిల్ల.

ప్రే:—Very happy to see you (ప్రేమ్జీ, మధురానికి షేక్‌హాండు ఇద్దామనుకొని చెయ్యిచాస్తాడు; అప్పుడు మధురం ముందుకున్న తనచేతులు వెనకిలాక్కొని 'నమస్తే' అంటుంది; ప్రేమ్జీ, షాక్‌తింటాడు.)

మధు:—మీరాకవల్ల మాగృహం పావనమయింది.

క్రో:—(బుర్రగోక్కుంటూ, సహేతుకంగా గ్రహిస్తూ) మధూ! ప్రేమ్జీ కార్యార్థులై వచ్చారు.

మధు:—ఓహో! అలాగా!

ప్రే:—అవునండీ. వచ్చే ఆదివారం సాయంకాలం 3½ గంటల కు మా స్వేచ్ఛాప్రణయసంఘవార్షికోత్సవం జరుప దలంచాము. దానికి మీరు అధ్యక్షత వహించి దిగ్వి జయంగా జరిగించగలందులకు మాప్రార్థన.

మధు:—ఈమాత్రం స్వల్పవిషయాలకు ప్రార్థనలెందుకండీ? చాదస్తంగాని. అలాగే, దానికేం?

ప్రే:—ఇదుగో ప్రోగ్రాము. మీరు నిరాకరించరనే ధీమాతో మీపేరుకూడా స్వతంత్రించి వేసుకున్నాం.

మధు:—Oh! Doesn't matter. ఇలాంటివి తరచు జరుగుతూండడం మామూలు, అందులో కార్యదర్శు లకు పరిపాటు అయిపోయింది.

ప్రే:—కృతజ్ఞతాపూర్వక వందనాలు.

మధు:—No mention please.

క్రో:—(డ్రాయర్ మీద వ్రాతప్రతితీసి) అమ్మాయ్! ఏమి టో వ్రాస్తున్నట్టున్నావ్! గ్రంథరచనేమిటి?

మధు:—(విజయవంతంగా) 'స్త్రీ స్వాతంత్ర్య' మని వ్రాస్తు న్నా. దీన్ని ఎనిమిదిభాషల్లోకి తర్జుమాచేయించి...

క్రో:—(మాట త్రుంచేసి) ఓవల్టైన్ డబ్బామీద ఎడ్వర్టైజ్ మెంటులాగా?

మధు:—(ముకుళితవదనంతో) అబ్బా! పోదూ! ఎప్పుడూ ఇంతే మామవి ఎలాగైతేనేం హ్యూమరిష్టువి బయల్దేరావ్. విట్టేశావ్! ప్రేజ్ఞా! మా మహిళామహాశయానికి నా ప్రథమకానుకగా సమర్పించి ఫ్రీ కాపీస్ పంచిపెడదామని...

ప్రే:—ఓహో దివ్యంగా ఉంది. చక్కని అభిప్రాయం.

శ్రీ:—చాలా బాగుందమ్మా! మొత్తంమీద ఊరికే కూర్చోవ్ అచ్చమ్మా బుచ్చెమ్మా చెవులు కొరుకుతూ. (ప్రేజ్ఞానిచూపి) వీరుకూడా గ్రంథకర్తలే.

ప్రే:—సరిసరి.

మధు:—వీరి ప్రథమకుసుమం ఏమిటండీ?

ప్రే:—మా స్వేచ్ఛాప్రణయంవారి ప్రథమ......

శ్రీ:—(మాట పూరించును.) కవితాసంతానం—గ్లాస్కో బేబీలాంటి శిరీషకోమలకుసుమం.

ప్రే:—'ప్రేమం'అని ప్రేమమీద చిన్న గ్రంథం ప్రచురించాం. (ఇంతలో తండ్రి జానకిరాం సూట్ కేసు, హోల్డాలుతో రైలు దిగివచ్చిన మనిషిలాగ ప్రవేశం.)

ప్రే:—Take leave of you, madam! తప్పక దయచేస్తారుకదూ!

(పేజ్ఞా నిష్క్రమణ)

జా:—(ప్రేమ్జీ వెళ్తూండగా, సులోచనాలు సర్దుకొని) ఈ కుర్చీనలంకరించిన పెద్దమనిషి మీ మిత్రబృందంలో వారా ?

మధు:—(అవునన్నట్టు సూచించును.)

జా:—(క్రొమ్మనను ద్దేశించి)ఇదుగో! బావగారు సరిసరి. బావాజీ! దారితప్పి వచ్చినట్టు కనిపిస్తుందే. ఈమధ్యను బొత్తిగా Vanishing cream అయిపోయేరే.

క్రొ:—తీరిక లేక రాలేదు. స్టూడియోలో రాత్రింపగళ్ళు...

జా:—అవునవును. కొందరు దివాంధులు, రాత్రించరులూ ఉంటూంటారు. మీరన్న మాటేమిటి ? బంధుకోటంతా మమ్మల్ని వెలివేశారు. వయసువచ్చిన పిల్లకి పెళ్ళి చేశాడు కాదని సాంఘిక ఆంక్ష విధించి మామీద అమలు జరిపేరు.

క్రొ:—అబ్బే ! నయం. పొరబడుతున్నారు.

జా:—మీ సంప్రదింపుల్లోనూ, మీ చేతల్లోనూ, వ్యక్తమౌతోంది. చెయ్యవలసినదేదో నాకు పెద్ద శాస్తి, శిక్ష అనీ చేశారు. ఇంతకన్న ఏం చెయ్యగలరు ? మధురం నీమేనకోడలు అని చెప్పుకుందుకి నీకు నామోషి, తలవంపులూను. కష్టసమయంలో జీవనాళాలను పొడుచుకుతినే రాబందులుకాని బంధువులా వీళ్ళు.

శ్రీ:—బావగారు ! తప్పు అభిప్రాయపడుతున్నారు. అది వట్టి అపోహ! ఒకవేళ మహాత్ములకి అంతర్వాణి ప్రబోధం కావచ్చు. ఇంతకీ మీరు వెళ్ళినపని కాయా ? పండా ?

జా:—(కరుగ్గా) పండుకాయ! అంతా సెటిలైపోయినట్టే; తరువాత మాట్లాడదాం. ఆధ్వర్యం అంతా మీచేతిమీదేగా నడిచేదీ.

శ్రీ:—అయితే మేం వెళ్లొస్తాం.

జా:—మంచిది త్వరలో.

శ్రీ:—త్వరలోనా ?

జా:—అబ్బే ! త్వరలో కనిపిస్తారుకదా అని.

శ్రీ:—ఆఁ విధిగా.

[శ్రీవాస్మన నిష్క్ర.]

జా:—అమ్మాయ్ ! నీ కొక మంచి సంబంధం చూసుకొచ్చా. లక్షణమైన కుర్రాడు. పేరుప్రతిష్ఠలుగల వంశం. పేరు రవీంద్రనాథ్. కవిత్వధోరణి ఉన్నవాడు. కవిత చాలా సరళంగా ఉంటుంది.

మధు:—చాలా సరళంగా ఉంది నాన్నా మీరు చెప్పేది.

జా:—అల్లాంటి బుద్ధిమంతుడూ, యోగ్యుడూ నాకు అల్లుడవాలని...నువ్వు ఇష్టపడితేనేగాని...

మధు:—చేతులు కాలేక ఆకులు పట్టుకోలేకుండా చెప్తున్నాను. నాకు పెళ్లొద్దు నాన్నా! నే నీ మొగాళ్లతో వేగలేను. స్వేచ్ఛగా ఇలా బ్రతకనివ్వండి!

జా:—పెళ్లొద్దంటే ఎలా కుదురుతుం దమ్మా! వెర్రిపిల్లవ్. ఆ మూడుముళ్ళూ కనక పడ్డాయంటే నాభారం తీరిపోతుంది.

మధు:—మూడుముళ్ళూ పడ్డంతరువాయి ఆడవాళ్ల స్వతంత్రానికి గుదిబండ దాపరిస్తుంది. అవి మంత్రపూతమైన ముళ్ళుకావు! అమాయికపుపిల్లల జీవాల నుత్తరించే ఉరిత్రాళ్ళు!

జానకి:—అమ్మాయ్! అమ్మాయ్!

మధు:—నా స్వేచ్ఛకు,అభిరుచులకు అడ్డంకులుంటే పెళ్ళయినా సరే పెడాకులవుతుంది. వెంటనే విడాకులిచ్చేస్తాను.

జానకి:—విడాకులిస్తాను,విడాకులిస్తానని ఎగరడమే కాని 'మోహ' అంతా నమలినతరువాత ఇంక విడాకులిచ్చేదేమిటి నా తలకాయి. సంబంధం కాళ్ళదగ్గరకు వచ్చినపుడు పెళ్లొద్దు పెళ్లొద్దు అని గునిసి బిర్రబిగిసి త్రోసిరాజంటే తరవాత ఎవ్వరూ ఎక్కరు - గుమ్మం. అక్కడితో ఇదిగో పులి అంటే అదుగో తోక అనేస్తుంది సమాజం.

మధు:—ప్రేమీ ప్రేమికులు ఒకే హృది, ఒకే ఆత్మ గలవా రైననాడు సమాజం ఏమీ చెయ్యలేదు. భగవంతుడు కూడా జడుస్తాడు వారి పవిత్ర ప్రేమకు.

జా:—అవునా ? ఆ అపూర్వ దాంపత్యం ఉన్నప్పుడేకదా, సమాజం నోరెత్తకపోవడం ?

మధు:—ప్రేమోద్వేగంలేని ప్రణయానికి అమరత్వం ఉంది అన్నాడు కాళిదాసు.

జానకి:—అమ్మాయ్ ! ఇంత తెలుసున్న దానవు విద్యావతివి నువ్వే పెళ్లొద్దంటే ఎలాగమ్మా ? కాళిదాసు, ప్రేమ, వివాహాన పరిపూర్ణత, సార్థకత పొందుతుందని శాకుంతలాది నాటకాల్లో ప్రత్యక్షీకరించలేదూ ? ఏమంటావమ్మా ?

మధు:—సరే చూద్దాం. నుంచున్న పళాన్ని ఎలాగ? వివాహపాశం పీక్కి చుట్టుకుందంటే వదల్దు. చచ్చేపర్యంతంఅంతే. Life and death question — Marriage!

[తెర.]



# ప్రణయసామ్రాట్.

## ద్వితీయాంకము.



### ప్రథమరంగము.

[స్థలం:—స్వేచ్ఛాప్రణయసంఘం; కార్యదర్శి గది. సుప్రసిద్ధ పాశ్చాత్యసినీమాతారలచిత్రపటాలతో శైలిపాడ్స్టేండున్న అలంకృతమై వుంటాయి; గులాబిపూలతో ఫ్లవరవేజ్, టేబుల్, ఒక ఈజీచైర్, మరిరెండు కుర్చీలు - ప్రేమ్జీ తన మనోగత 'రోజ్' ని భావోన్మాదంలో తలచుకొని మురిసి పోతాడు - ముచ్చటిస్తాడు - ఛలోక్తిగా సంభాషిస్తాడు.]

ప్రే:—ఓహో! మెరుపుతీగె! ఉజ్జ్వలతార! ఉన్నతశీల! ఏమి! ఆ సౌందర్యం- ఆ మాధుర్యం- - ఆ లావణ్యం! ఆహా! నీ మధురమూర్తి ముందు హెలెన్, నూర్జహాన్ లెందుకూ? ఎంతటి సౌందర్యరాశైనా సరే తీసికట్టే! విశ్వకర్మ తన కళానైపుణి నంతా వినియోగించి ఒక అపూర్వప్రేమమయిని సృష్టించాడు. Congratulations! దేవుడా! (చేయి చాచును) వహూధినీ, గిహూధినీ, నువ్వు నిలబడ్డచోట నిలబడ్డాని కైనా

అర్హత ఉందా? లేదు —. లేదు. నీముందు పాలి
పోలిన తారల్లా ఉన్నారు. (రోజ్ Enlarged
Photo సమీపంలో మోకరిల్లి) జగన్మోహినీ!
ఇనుపకచ్చటాలు కట్టిన మహామహావాళ్ళంతా నీఅమృత
వీక్షకు ఆహుతే! పాదాక్రాంతులే! గ్రేటాగార్బో
నటన, డేరతీలేమర్ గ్లమర్, నార్మాషీరర్ హావభావ
విన్యాసాలు, ఇవన్నీ నీ అందచందాల వెల్లులముందు
క్రీనీడలే! Oh! my lovely Rose!

[జూలూ, ప్రేమ్జీ వెనుకనుంచి ప్రవేశించి గ్రంథం విని
ఉపక్రమిస్తాడు.]

జులూ:—ఏమిటోయ్ కథా! స్వగతం కాదుకదా? లేక
ఏ ఇరుగుపొరుగు గాలినైనా పలకరిస్తున్నావా? అలా
చెప్పు. నీ బండారం అంతా తెలిసిందిలే! నీ అందాల
పాలవెల్లి, నీ ఊహలపుట్టి, నీ ఆశయాల ఆలయం, నీ
ప్రణయిని! నీ గానకోకిల! నీ కిలకిలా! అంతర్ధాన
మయిందిలే!

ప్రే:—(విభ్రాంతిగా) ఆ- ఆఁ- ఏమిటీ- ఎంతపనిజరిగింది?
నిజంగా? అరే! ఎన్నిఒట్లు! ఎన్ని! ఎన్ని! ప్రియే
చారుశీలే! ఎంతపనిచేశావ్?

జు:—నీ'ప్రియే చారుశీల' అల్లా 'సాంబారుశీలై' లేచి చక్కా పోయింది,రొమాన్టిక్ హీరో కామ్రేడ్ విశ్వనాథ్‌తో.

ప్రే:—హారి విశ్వం! ఉన్నట్టే ఉండి స్నేహంలో చెయ్యి చెయ్యి కలిపేసి ఎంతపనిచేశావ్!

జు:—రొంబ కష్టం.

ప్రే:—నీపైలట్ గిరీమండా! అంతరిక్షంలోకి ఇట్టే లేవతీసుకు పోయి అదృశ్యమయ్యావ్! Invisible Rogue! నీ ఆయమాయగారడీ అంతా ఆయమ్మాయిమీదట్రా ప్రయోగించడం? [పదానించి] అయినా, మిస్టర్ జులూ! రోజ్ అల్లాంటి మనిషికాదు. ఆవిడంటే నాకు పరిపూర్ణ విశ్వాసం. ఆమె శీలాన్ని నేను శంకించను.

జు:—ప్రేమ్జీ! రోజ్ నువ్వు అనుకున్నలాంటి మహాఇల్లాలు మాత్రంకాదు. శుద్ధ దగాఖోర్. నీలాంటి అమాయకుల్ని ఆదర్శజీవుల్నీ బుట్టలో వెయ్యడంలో అవిడికి Nobel Prize కి అర్హత ఉంది.

ప్రే:—ఆమె సౌందర్యానికీ అందచందాలికి Super Nobel Prize తప్పకుండా ఇవ్వొచ్చు.

జు:—అందులో శ్రీవారు తలుచుకుంటే ఇట్టే ఇప్పించగలరు. ఆమె శీలాన్ని నేను శంకించను ప్రేమ్జీ!

ప్రే:—అవును! ముమ్మాటికీ సందేహించడానికి వీల్లేదు.

జు:—ఎంచేతంటావా? ఆమెకసలు శీలం అంటూ ఒకటి ఏడుస్తే శంకించడమో, మానడమో ఆలోచించవచ్చు.

ప్రే:—(రోషించి) చాలా విరుద్ధంగా మాట్లాడుతున్నావ్! జులూ! రోజ్ ఉత్తమా ఇల్లాలంటే నమ్మ (ప్రేమోన్మాదంలో ఫొటోచూస్తూ), Dear Rose! విరహవేదనలో పడి ఎంత నలిగిపోతున్నావో కదా!

జులూ:—అదుగో! అదే వద్దన్నాను అదేపాటా! రోజ్ రోజ్ అని ప్రతిరోజూ రోజ్ స్మరణే! ఎన్నిసార్లేస్ఫినా ఇదే ఏడుపు. విధీ విరామం లేకపోవడం సరిగదా మతీసుతీ కూడా పోయినట్టే ఉంది చూస్తూంటే.

ప్రే:—పోయినట్టే ఉంది చూస్తూంటే! (అతి సీరియస్ గా రోజ్ ముఖచిత్రంకేసి చూస్తూ, జులూపలుకులు పెడచెవిని పెడుతూంటాడు.)

జులూ:—ఏమిటో ఆప్రేమ! అర్థంకాకుండా ఉంది. ఎక్కడుందిరా ప్రేమ? నీకు ప్రణవనామజపం అసలే పూజ్యంకదా ఈప్రణయనామం, రోజ్ నామం ప్రళయగంభీరనాదంతో నీబుర్ర గింగురులెత్తించి నిన్ను శుద్ధ ఒత్తుధాగా చేసేసి, దుంపతెంపేస్తోంది తెలుసునా?

ప్రే:—[తన తలకాయని రెండుచేతులతోటి అదిమిపట్టి మరో ప్రపంచంలో మనిషిలా వెర్రిగా దిక్కులు పరికిస్తూ]

మానసికతుపాన్ ! Brain wave! రోజ్ ! నీ దర్శనార్థమై నామెదడు వీరణం త్రొక్కుతోంది. చతుర్దశ భువనాలూ ప్రదక్షిణం చేస్తోంది, నామనస్సు నిన్ను వెతుకుతూ - నాహృదయం కొంపతవ్వి నాకే విడాకు లిచ్చినట్టుగా తోస్తోంది. నేను ఆ రోజ్ - -

జులూ:—నేనూ లేదు - వేనూ లేదు - కట్టిపెట్టు అఘోరణి. బరబరా ఈడ్చుకువెళ్లి పిచ్చాసుపత్రిలో పారెయ్యగలను. ఎక్కడో గడ్డిపువ్వుని పట్టుకుని రోజ్ అంటావేమిటి ! నీ ఆత్మీయ రోజ్ వాడి వడిలిపోయిందిలే !

ప్రే:—ఎంత మాటన్నావ్ ?

జులూ:—దీన్ని ప్రేమ అనరు. పిచ్చి అంటారు. ప్రేమనేది ఈప్రపంచంలో లేనేలేదు.

ప్రే:—ప్రేమ అనేది లేదంటావ్ ? అంతసాహసమే ! విశ్వవ్యాపకమైవుంది ప్రేమానుబంధం. ఏదేశపు సారస్వతమైనాచూడు ! ప్రేమనుగురించీ, ప్రేమతత్వాన్ని గురించీ, Immortalise చేశారు. అమరత్వం ఆపాదించారు. స్వర్ణాక్షరాల్లో లిఖించారు. ప్రేమ తడాఖా నీకేం తెలుసూ ? పుస్తకాలు చెదపురుగుల్లా తినెయ్యడం తప్పితే, ఏమైనా చదివేడుస్తేగా !

జులూ:—చదివేడిసిఉంటే నీలాగే నేనూ ఏడుస్తూవుందును, ఏ మార్కెట్ లేడీనో బజారుస్త్రీనో మనస్సులో ఊహించి, ప్రేమించి మదనజ్వరంతో. సర్వసాధారణంగా మానవులు మోహించి పెళ్ళాడుతున్నారు. నూటికీ కోటికీ ఏ ఒక్కడో ప్రేమించి పెళ్ళాడతాడు. ప్రేమ అనేది అరుదని యదార్థవాది చెప్పాల్సిఉంటుంది.

ప్రే:—చాల్లేవోయ్! యదార్థవాదివి ఎల్లాగైతేనేం బయల్దేరేవ్! శ్రీరంగనీతులు చెప్పొచ్చావ్! ప్రేమ లేదనేవాడి మొహం చూడకూడదు. (కళ్ళు మూసుకుంటాడు.)

జులూ:—(భావగర్భితంగా) అంధఃప్రకృతి! కవికుమారుల రచనల్లోనూ, ప్రబంధాల్లోనూ మాత్రమే వెలిసిందీ ప్రేమ. ఆ గ్రహాన్నే ఆరాధిస్తున్నారు ప్రేమోపాసకులు. ఊహాయానాలు సలిపే 'భావన-తలకాయ'ల్లో ఉంది ప్రేమ బీజం. శుద్ధగాలి! బండఅబద్ధాలు వ్రాశారు. వాస్తవిక జగత్తులో ప్రేమకి సుతలాం నామరూపాలు లేవంటే విశ్వసించవోయ్ మొగడా! బుర్ర తినేస్తున్నావురా బాబూ!

ప్రే:—(సత్యాగ్రహంతో) ఆ అమృతహస్తుల రచనలు, వారి స్వానుభవ ప్రతిబింబాలే! ఆకల్పాంతం శిలాశాసనాల్లా

పడిఉంటాయ్! అల్లాంటి మహనీయుల్ని పట్టుకొని తల వెంట్రుకవాసి అయినా ప్రేమతత్త్వం తెలియదు, తప్పులతడకలు వారి రచనలని దులిపి ఒదిలిపెడతావ్ ? నీలాంటి వేరుపురుగులూ, చీడపురుగులూ సంఘానికి ద్రోహంచేస్తున్నారు.

జులూ:—నీలాంటిప్రముఖులు, సంస్కర్తల్లో సంఘపు పట్టు కొమ్మలై ఉద్ధరించి ఉత్తేస్తారు. ఇంతకీ ప్రేమ అంటే ఏమిటో ఒక్క గుక్కలో చెప్పెయ్! నీ శిష్యకోటిలో ప్రప్రథముడుగా చేరిపోతా.

ప్రే:—కేవలం అనుభవైకవేద్యమైనది ప్రేమ ! అగమ్యం, అతీతం, అనిర్వచనీయం కూడా ! ఎందుకొచ్చిన బి. ఏ., లు ! ప్రపంచకజ్ఞానం లేకపోయాక ? 'A, B, C of ప్రపంచం' తెలియకపోయాక!

జులూ:—మహాత్మా ! సర్వమూ తెలిసిన విజ్ఞానులు, తమ లాంటివారు పూనుకుని ఒక 'ప్రేమపరిషత్'ని స్థాపించి ప్రేమపరీక్షలు జరిపి, అందు తీర్ణులైనవారికి 'ప్రేమ భిషక్' 'ప్రేమరతన్' 'ప్రణయాచార్య' 'Doctor of Romance' అనే డిగ్రీల నియ్యండి.

ప్రే:—చూడండి—శ్రీవారు ఆప్రేమపరిషత్తుకి శాశ్వత అధ్య క్షులుగా ఉండాలని నా మనవి.

జులూ:—కాగా, నా దొక చిన్నమనవి. ప్రణయసామ్రాజ్ఞీ! ప్రేమ మీద Encyclopedia లాంటి చిన్న నిఘంటువు నొకదానిని రచించిపారేస్తే లోకాన్ని ఉద్ధరించినవా రౌతారు. ఇంతకన్న మానవసేవ వేరొకటి ఉండదు, ఉండనేరదు.

ప్రే:—(విజృభించి) మనం మాట్లాడుతూన్నది ఒక సామాన్య విషయాన్నిగురించి కాదు! ప్రేమతత్వం తెలిసినవాడు ఎన్నడూ ఈధోరణిలో మాట్లాడడు. పిడివాదానికీ, 'నోటానోటీ'కి ఈసమస్య పరిష్కారమవదు.

జులూ:—ప్రేమోపాసక్ మహాశయా! అయితే తమరే సెల వివ్వండి ప్రేమంటే ఏమిటో?

ప్రే:—(వెర్రి ఆవేశంతో) ప్రేమ! ప్రేమానుబంధమే ఈకాల చక్ర పరిభ్రమణకు మూలాధారం! ఆదిపీఠం! సృష్టి కంతకీ ఆద్యంతసూక్తిపుంజం! విశ్వమానవప్రేమైక దృష్టిలోనే దైవము ఈవిశ్వాన్ని సృష్టించాడు. ప్రేమ కవచమే మానవులకు శ్రీరామరక్ష! (మిస్ రోజ్, డైరక్టర్ విశ్వనాధ్ ప్రవేశించి చల్లగా ఉపన్యాసం వింటూంటారు.) జీవితనౌకను అమరధామం దరిజేర్చి చుక్కాని ప్రేమ! మానవుని హృదయాంతరాళములో ప్రదీప్తమయ్యే మహత్తర ఆశయాల్ని చిలికి చిలికి

ప్రజ్వల్లజేసి, జీవితం వినిర్మల ఆనందప్రపూరంగానూ, ప్రపంచం స్వర్గతుల్యంగానూ, ప్రత్యక్షీకరించేది ఈ ప్రేమయే, ఈప్రేమయే! వేదవేదాంగముల నిగ్గు! జీవసుధ! అబ్బా! ప్రేమ! ప్రేమ! (అంటూ భావోన్మాదంలో చేష్టలు తక్కి ఫిట్టులో వాలిపోతాడు కుర్చీలో; రోజ్, డైరక్టర్లు ఇరువురూ అతిగాభరాగా శీతలోపచారాలు చేసి, సేదదీర్చి, మళ్లీ ఈజీ ఛైర్ లోకి సాయంపడతారు. లెమన్‌క్రష్ ఇచ్చిన కొంతసేపటికి ప్రేమ్జీ ప్రపంచధోరణిలోకి వస్తాడు)

రో:—ప్రేమ్జీ! ఫిట్టులోంచి తేలేరా?

ప్రే:—ప్రేమ! అబ్బా! మీరంతా ఎప్పుడు దిగేరు, రోజ్?

జులూ:—కేవలం 'బొమ్మచెముడు రకం లవ్' రా పీడివి! మొండిజాతి! ఎన్నిసార్లు చంపినా చావదు.

డైర:—లెమన్‌క్రష్ త్రాగినతరువాత ఎలావుంది ప్రేమ్జీ?

ప్రే:—వుంది!

జులూ:—'ప్రేమ్‌క్రష్' త్రాగితేనేగాని స్థిమితపడడు. 'రోజ్ క్రష్' అయితే Magic Wand లా టచ్ తగిలేసరికల్లా మంత్రించినట్టుగా లేచి కూర్చుంటాడు. 'రోజ్‌టీ' అయినా ... ...

రో:—(చురచురచూస్తూ) వటప్ ! యూ ఫ్రూల్ ! Double-distilled villian ! గెటవే !

(జులూ నిష్క్రమిస్తూండగా.)

రో:— ఇలాంటి వాగుడుకాయలు అవతారం చాలించ కూడదూ ?

జులూ:—భూభారం తగ్గిపోను, మనం అస్తమించినట్లయితే !

(నిష్క్ర-)

రో:—హాఁపిడుగా ! ఎంతమాటన్నావ్ !

డై:—ఏమిటో ! వేడిరక్తం ! పోనిద్దూ ! అయితే మిస్టర్ ప్రేమ్జీ! మనక్లబ్ ఏనివర్సరీకి ప్రెసిడెంటు ఎవరు ?

ప్రే:—శ్రీమతి మధురం బి. ఏ., జానకిరాంగారి అమ్మాయ్.

డై:—మధురం ఒప్పుకుందా ప్రెసిడెంటు గిరీకి ?

రో:—ప్రేమ్జీగారు నోరువిప్పి అడుగుతే ఎవరుమాత్రం ఒప్పుకోరు ?

ప్రే:—మధురం ఎంచేత ఒప్పుకోదు ? మనం గౌరవించి ప్రెసిడెంటు హోదాలో పిల్చినప్పుడు ?

డై:—ఆమె మొగద్వేషి; కరుడుకట్టిన మొగద్వేషి. ఎంతమనిషినైనా వాదనవచ్చిందంటే నిలువునా ప్రాణాలు తీసేస్తుంది. కడిగేసి ఒదిలిపెడ్తుంది.

ప్రే:—ఆమె ద్వేషం నాకెంతమాత్రం కనిపించలేదు.

రో:—మీరొక వేళ.........

ప్రే:—మీరొక వేళ ఏమిటి రోజ్ ?

రో:—మీరొక వేళ గుర్తించకపోవచ్చును.

డై:—ఆవిషయంలో మీరు చాలా అదృష్టవంతు లన్నమాట!. చివాట్లు తప్పినందుకు...

ప్రే:—మధురం వివాహద్వేషిఏమో కాని...

డై:—శ్రీమతి- 'పెళ్ళొద్దు- పెళ్ళొద్దు- కాలేజీ'కి ప్రిన్సిపాల్ !

ప్రే:—చాలా బాగుంది Capital !

రోజ్:—డైరక్టరుగారు సామాన్యులా ! మనుష్యుల స్వభావాలు, తత్వాలు కనిపెట్టడంలోనూ, అవి Express చెయ్యడంలోనూ అంతటిపెద్దచెయ్యి మన ఆంధ్రదేశంలో లేనేలేదు.

ప్రే:—(వ్యంగ్యంగా) అంత వాడెవ్వడూ లేడు.

డై:—మానసికతత్వం, మానవస్వభావ పరిజ్ఞానం లేకుంటే ఫిలుములు డైరక్టుచెయ్యడం ఎలాగ ? చులాగ్గా డైరక్టర్ని పత్తివెధవరా ! బడుద్ధాయ్ ! అనేస్తారు.

ప్రే:—కళ అంటే ప్రాణంఇచ్చే కళోపాసకులు ఎన్నడూ ఆ విధంగా తలంచరు.

రోజ్:—కళ అంతా స్త్రీలో మూర్తీభవించి ఉందనీ స్త్రీయే కళామూర్తి, జ్యోతిర్మయీ అనీ...

డై:—ఆదిశక్తి, అమ్మశక్తి అని...
రోజ్:—స్త్రీలని ఆరాధించే ప్రబుద్ధాంధ్రులు కూడా ఉంటారు.
ప్రే:—ఉన్నారు! పురుషులచే పూజింపబడే అర్హత ఉన్న స్త్రీలు చాల తక్కువమంది ఉన్నారు. బైదిబై రేపు వార్షికోత్సవానికి అన్నీ సంసిద్ధంచేసుకుని బాగా జరిగిద్దాం.
రోజ్:—రేపు Function లో నేనొక స్పీకర్‌గా ఉంటాను.
డై:—గొప్పగా ఉంటుంది. [తెర.]

---

ద్వితీయరంగము.

[స్థలం: మధురం ఇల్లు. సమయం, వార్షికోత్సవమైన మరునాటి ఉదయం. మధురం భావగీతం పాడుతూ మంచి మూడ్‌లో ఉంటుంది.]

జులు:—చూడండి. మీగొంతుకలో మంచి సుఖం ఉంది.
మధు:—ఉంది, ఉంది — ఇప్పుడే ఒక క్రష్ త్రాగడంచేత సుఖంగా ఉంది. ఈభావగీతాలు, హృదయం ఉప్పొంగి ఎలుగెత్తి పాడుతున్నట్టు ఆనందాన్ని తెలుపుతాయ్! హాయి నిస్తాయి.
జులు:—విరహవేదనలో నలిగిపోయే సోదరీమణులకు చాల మనశ్శాంతి నిస్తాయి.

మధు:—నేను పాడుతూంటే 'అమర'గానంలా లేదూ ?

జులు:—ఆహా! అమృతం వీనుల సోకుతోంది. రాళ్లని సహితం ద్రవింపజేసే ఆ'మర'గానం, పిండిమరగానం ఏమిహాయిరు! నీ సంగీతాన్ని మానవులు విని ఆనందించలేరు. అచేతనాలన్నీ తన్మయత్వం చెందిపోయి జోళ్ళు జోళ్ళుగా ఎగిరిచక్కారావల్సిందే! అదే నిర్ధారణ.

మధు:—Shakespeare మహాకవి సంగీతాన్నిగురించి ఏమన్నాడో తెలుసునా ?

జులు:—ఏమంటాడు ?

మధు:—అబ్బే ! అల్లాంటివి జ్ఞాపకం ఉండవుగా ?

జులు:—'అబ్బే అలాంటివి జ్ఞాపకం ఉండవుగా' అన్నాడా ?

మధు:—అబ్బా ! చెబుతూంటేనే! 'తారామండలంలో కొన్ని గ్రహాల పరిభ్రమణంవల్ల Music of the planets అని ఒకవిధమైన గానామృతం చిలకబడు నన్నాడు.

జులు:—అంటే ?

మధు:—ఆకాశంలో విశ్వవీణ నిరంతరమూ మీాటబడుతోందని భావం.

జులు:—తమ అభిప్రాయం ?

మధు:—ఆ వీనుల సోకెడి విశ్వవీణారవాన్ని శుకపికాదులు అనుకరిస్తున్నాయని.

జులు:—ఓ కవయిత్రీ! మధూకోయిలా ! Carlyle మహాశయుడు పాపం, దూరదృష్టి గలిగి మనలాంటి గాయకశిఖామణులు ఉంటూంటారని తెలిసివుండే గాయకుల దౌర్జన్యంనుండి శ్రోతలను కాపాడే శక్తి ఆలోచించి "Silence is music" అని స్వర్ణాక్షరాలతో లిఖించి పారేశాడు.

మధు:—ఎంతపనిచేశాడు !

జులు:—కనుక నిశ్శబ్దంగా ఉండడమే అమరగాన మన్నమాట; తమరు కాస్త దయ ఉంచి నిశ్శబ్దంగా ఉంటే విని ఆనందించ గలం, ఆ నిగూఢ గానం—చెవుల్లో తుప్పు !

మధు:—చెవులున్నందుకు సార్థకమయిందా ?

జులు:—అయింది - - మహా బాగా అయింది, శాస్త్రి! ఇహ ముందునుంచి పాడుతున్నానని 'అల్టిమేటమ్' ఇచ్చి మరీ పాడు. లేకపోతే అమాంతంగా హార్టుఫెయిలై చస్తాం.

మధు:—ఇలా చావడం కూడా ఒక క్రొత్తరకం మేలిమిరోగం కాబోలు ! సరేకాని సోమయాజులు !

జులు:—(మాట త్రుంచేసి) Sorry! క్షమించాలి ! నాపేరు సోమయాజులు కాదు; మిస్టర్ జులు అంటారు.

మధు:—(పక్కున నవ్వి) ఓహో ! అదెప్పుడు ? అల్లాగా ? చాల ముద్దుగా ఉంది. మిస్టర్ జూలు, (నాలిక కర్చు

కొని) జలూ! తమ శుభ నామధేయం అన్నమాట!
దీని భావమేమి జలూ మహేశా ?

జలు:—దానికేం తా ఉంది; చెప్తున్నానుగా మరి! ఏముంది? దొరలు మిష్టర్ Stark, మిష్టర్ Stone, మిష్టర్ Wood, అని రాయిూ రప్పా, కొండా పేర్లు పెట్టుకోవడం లేదూ ?

మధు:—అవును... పెట్టుకుంటే...?

జలు:—(శేషజంగా) మనం దొరలకి ఎందలో తీసిపోతాం?

మధు:—(బుర్రలో అన్నట్టు చేతితో సూచించును) దీంట్లో.

జలు:—'మిష్టర్ జలూ' అంటే చూశావో లేదో ఒకవిధమైన నాగరీకం ఉంది. ఉద్యోగం ఇచ్చేవాడెవడైనా ఈనామకరణం గల ఆసామిని ఏ Anglo-Indian గానో భావించి, త్వరలో ఇంటర్వ్యూ ఇచ్చి, పిలిచి పొమ్మనడానికి అవకాశం ఉంటుంది!

మధు:—పాపం! నిరుద్యోగుల బాధలు పరాయివాళ్లకైనా మహాప్రభో వద్దు!

జలు:—పడికాపులు పడి ఏడవలేక ఇల్లా ఇంకో అవతారం ఎత్తవలసివచ్చింది; ఏంచేస్తాం! నిరుద్యోగుల గ్రహచారం!

మధు:—సరిసరి! మనవేషం, కథా, కమామీషు up-to-date తాలింపుడబాయింపు చూసి నిరుద్యోగి అని ఎవ్వడూ పసికట్టలేడు.

జులు:—ఈమాత్రం ఘరానాగా కనిపించకపోతే బజార్లో Credit అయినా పుట్టదు. పలకరించే పోకేలా స్నేహితులు వారికి నామోషి అని పలకరించరు. దేనికైనా ఆడంబరం, కటాటోపం, డబాయింపు పనికొస్తాయి.

మధు:—నిరాడంబర జీవనమే జీవనం! అయినా కొంతవరకూ ఘరానాతనం ఉండాలి.

జులు:—(వ్యంగ్యంగా) అందుకేగా ఈవేషాలు

మధు:—సరేకాని సోమయాజులు... అరెరే పొరపాటే... మిష్టర్ జులూ అని పిలవాలి కాబోలు! గొప్ప చిక్కే వచ్చింది.

జులు:—చిక్కు విడతీయడంలోనే ఉంటుంది ప్రతిభ! అవును గాని, నిన్న స్వేచ్ఛాప్రణయవార్షికోత్సవంలో మధురం గారు ఉపన్యాసం చెక్కేశారు; సగం అయేసరికల్లా ...నోరెళ్ళపెట్టేరు.

మధు:—(తెలతెలపోయి) ఆఁ...

జులు:—ప్రేక్షకులు...ఎలాజరిగిందంటారు ?

మధు:—చాలా బాగా జరిగింది. ప్రేమ్జీలాంటి ఆదర్శజీవి, సంస్కారి, అహోరాత్రాలు కష్టపడి నెత్తురుచుక్కలు సంస్థకి త్యాగంచేస్తే బ్రహ్మాండంగా జరగదూ ?

జులు:—సంస్థే అన్నమాటేమిటి ! ఏవిషయంలోనైనా సరే త్యాగం చేస్తేనే ఉంది.

మధు:—(అనాలోచితంగా) ప్రేమ్జీ చాలా సరసమైన వ్యక్తి!

జులు:—ప్రేమ్జీనిగురించి 'మీ అభిప్రాయం ఏమిటీ' అని ఎవ రడిగేరు ? కాని. ఏమిటావిరసం ?

మధు:—(నవ్వుకుని) ఒకళ్ళు అడిగేదేమిటి అభిప్రాయా లివ్వ డానికి...

జులు:—రోజా అమ్మగారు ఎలా మాట్లాడేరు ?

మధు:—H. M. V. Record లా మాట్లాడింది. ప్లేటు వేసేసింది.

జులు:—మీటింగులో గణగణ లాడించినంతసేపూ గజగజ మాత్రం పోలేదు.

మధు:—గొప్ప పరిశీలన !

జులు:—కొందరికి స్టేజి ఎక్కగానే సభాకంపం, భూకంపం వస్తాయి.

మధు:—మన విచిత్రసంభాషణలకి అగ్నిపర్వతం పెల్లుబిరుగు తుంది కూడాను.

జులు:—డైరెక్టర్ విశ్వనాథ్ చెప్పడం చూడాలి! మూడు ముక్కలు జాంర్ఘుకారా అంటూ చెప్పేసి One, two, three, O. K! Crank the Camera and Shoot! అన్నట్టు ముగించేశాడు, పెద్దచెప్పే మొనగాడిలా లేచి.

మధు:—అతనూ ఒక మనిషే?

జులు:—అతనూ ఒక మనిషే!

మధు:—అదే నేనూ అంటూంట. కాని జులూ! ఆడబ్రతుకే మధురం అనడంలో ఏమి గొప్పభావం ఉందనుకు న్నావ్?

జులు:—చాల గొప్పగా ఉంది కాని, నేను నీతో ఏకీభవించను.

మెదడు గిదడూ మనసూ లేని గేదె బ్రతుకే మధురం। మధురం, అతిమధురం, ఆమహిషిబ్రతుకే మధురం॥మొ॥

మధు:—(గుడ్లురుముతూ) యూ! ఏం! క్రిందు మీదు కానక్కర్లేదూ? మీ మట్టుకి మీ రేమనుకుంటున్నారో మొగాళ్ళు! పరిచయం అయిందికదా అని స్వేచ్ఛగా కుడీ, ఎడమా లేకుండా ప్రేలడమే? Highly foolish! Unmannerly! Idiotic!

జులు:—ఆ! ఆ! అంత దిలుపే! ఏదో పరిహాసానికి అంటూంటే సీరియస్ గా తీసుకోవడమే?

మధు:—ఆడబ్రతుకులో ఉండేమాధుర్యం మీకేం తెలుస్తుంది బ్రహ్మచారికి ?

జులు:—అవును, అవును. మహాఇల్లాలికి తెలుసు.

మధు:—ఆ మహాకవి ఎవడోకాని ఎంత అనుభవైకవేద్యమైన మానవాతీతమైన అంశాన్ని లోకానికి చాటేను ?

జులు:—నేను గేదెబ్రతుకే మధురం అనడంలో ఎంతమాత్రం తప్పుకాదు. ఎంచేతంటావా ? మనం...

మధు:—మనం గినం నాతో తమరు ముచ్చటించవలసిన అవసరంలేదు. వ్యాఖ్యానాలూ, ఉపసంహారాలు ఎవరికావాలి ?

జులు:—మనిషన్నవాడికీ పశువుకీ భేదం ఏమిటంటే, మనిషికి వివేచనజ్ఞానం, మేధాశక్తి, ఒక్కమాటలో చెప్పెయ్యాలంటే బుర్ర ఉండడంమూలాన, ఆలోచనా పాలోచనా అనుమానులు తర్కించి, యోచించి, తన కుశాగ్రతని బట్టి ఒక సంఘటనాన్ని నిర్ణయిస్తాను.

మధు:—ఊహూం ఊ ? అందువల్ల...

జులు:—మంచిచెడ్డలూహించడం, అతిగా ఆలోచనలో పడే సరికల్లా మనసు పరిపరివిధాల వ్యథలకులోనై కుళ్ళి చిల్లులుపడడం, జీవితం పెద్ద పెనుభూతంలా అని, నరక

కూపతుల్యంగా భావించి, భావిజీవిత శేషాన్ని 'ఆనందో బ్రహ్మ'లా అనుభవించలేకపోవడం జరుగుతోంది.

మధు:—ఈ తర్కవితర్కజ్ఞానం ఉన్నపశువుల మాటో ? వీరు ద్విపాదులు. అవి చతుష్పాదులు. బై ది బై, మిష్టరు జులూ! నువ్వో గేదెను కట్టుకో మధురాతిమధురమైన భూకైలాసం అనుభవించవచ్చు.

జులు:—మధురం! నువ్వింత మధురంగా తేనెసోనలు ఒలుకుతూ, కులుకుతూ మాట్లాడుతూంటే నిప్పులు చెరుగుతూన్నంత హాయిగా ఫీలవుతున్నా. సెలవు ! తిరిగి దర్శనం చేసుకుంటా.

మధు:—జులూ ! చిన్నకబురు. రేపు...

జులు:—రేపు... ఏమైన పర్వదినమా ?

మధు:—ఉహూ ! కాదు. నాపుట్టినరోజుపండుగ.

జులు:—కాకపోవడమేమిటి ? ఇంచుమించులో అలాంటిదే !

మధు:—అందులో శ్రీమతి రోజ్ గానాబజానా పెట్టించాలి.

జులు:—రోజ్ గానంఉంటే విధిగా డైరక్టరుగారిని పిలిపించాలి.

మధు:—డైరక్టర్, ప్రేమ్జీ, జులూ వగైరాల్ని ఆహ్వానించాలి! వీలైతే ప్రేమ్జీచే భావగీతాలు పాడించాలి. ప్రేమ్జీకి ఆహ్వానం ఇదిగో మీరే అందచెయ్యండి. (ఆహ్వానపత్రమందిచ్చును.)

జులు:—అయ్యో! అంతకంటేనా?

మధు:—పుట్టినరోజు పండుగ ప్రోగ్రాం ఎలాఉండంటారు? ఇంకా ఏమైనా సలహాలు?

జులు:—దివ్యంగా ఉందంటాను. రేపు బహుశా డబుల్ ప్రోగ్రామ్‌కూడా జరిగేటట్టు తోస్తుంది... ఊఁ. నడిపించండి, కథాక్రమణ! నేను పోయి ప్రేమ్జీని కలుసుకోవాలి.

(అంతా నిష్క్ర; తెర)



# ప్ర ణ య సా మ్రా ట్.

## తృ తీ యాం క ము.



### ప్ర థ మ ర ం గ ము.

[స్థలం:—మధురంఇల్లు; నాలుగుకుర్చీలు, రెండుబల్లలు; తండ్రి జానకిరామ్ ఈప్రయత్నమంతా చూసి తనకుర్చీని దూర దూరంగా ఈడ్చుకుంటూ పేపరు చూస్తూంటాడు, విముఖతను తెల్పుతూ.]

మధు:—నాన్నగారూ! నేడు నా పుట్టిన రోజు పండుగ. అంతా సంసిద్ధంచేశాం...వచ్చిన అతిథుల్ని ఈవేళమాత్రం దయయుంచి రిసీవ్ చేసి, సత్కరించి, ఈ తల్లిలేని పిల్ల ముద్దుచెల్లించమని ప్రార్థన. (కంటతడిపెట్టును.)

జా:—ఊరుకోతల్లి! ఊరుకో! కళ్లు చెమ్మగిల నీయకు... నేడు నీపుట్టినరోజుకూడాను. నలుగురు పెద్దలూవస్తారు. (మధు నిష్క్రమణ; ఈలోపుగా Boyవచ్చి డైరక్టరు, రోజ్ వస్తున్నారని చెప్పినతరవాత వారి ప్రవేశం)

డై:—వందనాలు!

రోజ్:—నమస్తే!

జా:—దయచెయ్యండి ఇలాదయచెయ్యండి డైరక్టరుగారు.

డై:—Thank you!

జా:—(రోజ్‌తో) అలా లోపలికి వెళ్లమ్మా.

రోజ్:—ధన్యవాదాలు!

జా:— నే నిప్పుడే వస్తా - చిన్నపనుంది.

డై:—చిత్తం.

రోజ్:—అయ్యో! మీరులేకుండా ఎలాగ?

జా:—(నిష్క్రమిస్తూ) వస్తున్నా.

(జానకి నిష్క్రమి; మధు ప్రవేశం.)

మధు:—ఇరుగో! ఎప్పుడో దిగేరు! తోడదొంగలు - అలికిడి లేకుండా.

రోజ్:—మేం కబురుచేసి మరీ వచ్చాం గనకనా.

డై:—ఈవేళ మధురంగారి పుట్టినరోజు గనుక ఆవిడ ఏమన్నా నరే Full licence ఉంది.

(పీఠిగుమ్మంలో జులూ, ప్రేమ్జీలు జానకిరామ్‌కి ఎదురుపడి,)

జులు, ప్రేమ్జీలు:—నమస్కారమండి!

జా:—ఎవరు వారు?

జులు:— నేనండీ జలూని.

జా:—అంటే? (సులోచనాలు సద్దుకుని) ఆనమాలు తెలియటం లేదు, పెద్దవాళ్ళమయామా మరి.

జులు:—కనిపించటములేదండి పెద్దవాళ్ళకి! రాఘవరావుగారి అబ్బాయిని.

జా:—ఓయ్! నువ్వటోయ్! ఎక్కడికో ఇట్టంగా వేషం బనాయించి బయల్దేరేవ్?

ప్రే:—మనింటికేనండి. అమ్మాయి పుట్టినరోజు కదండీ?

జా:—ఔనౌను! జ్ఞాపకశక్తి సడలింది. (ప్రేమ్జీనుద్దేశించి) ఈయనెవరు?

జులు:—వీరు ప్రేమ్జీ—మొన్న వార్షికోత్సవంలో మనురంజకంగా పెంటుగా ఉంట వీరిదాంట్లోనే.

జా:—ఓహో! ఇక్కడ నిలబడ్డారేమిటి? లోపలికి పదండి; ప్లీడరుగార్ని కలుసుకునివస్తా.

ప్రే:—చిత్తం.

జులు:—త్వరలో రావాలి తమరు, ఆ లిటిగేషన్ అనుసునాటి.

(జానకిరామ్ నిష్క్రమి)

(ఇంట్లో, మధురం, డైరక్టర్, రోజ్ నవ్వుతూంటారు.)

మధు:—రోజ్! ఈలోపుగా నువ్వొక... పాటపాడి కాలక్షేపం చేయించాలి.

రోజ్:—నువ్వేపాడాలి నీ పుట్టినరోజుగనుక. నామీద ఒట్టే

డై:—I second it! చక్కని పాట పాడండి.

(మధురం పాట పాడుతూండగా ప్రేమ్జీ, జులూలు ప్రవేశించి ఆలకిస్తారు.)

జులు:—(పాట అంత్యంలో) ప్రేమ్జీ! వింటున్నావా? ఆ మధుర గానం వింటూంటె హృదయం అమాంతంగా తారలను తాకి, మళ్ళీ వెనక్కి ఎగిరి చక్కావస్తుంది. పాట అంటే అల్లా ఉండాలి.

ప్రే:—కిన్నరకంఠం, అప్సరరూపం, యవ్వనతేజం, అన్నీ నేడు ప్రాప్తించాయి.

డై:—మధురంగారి ధర్మమా అంటూ. (రోజ్ వైపు చూస్తాడు)

జులు:—డైరక్టరుగారూ! షూటింగ్ ఎంతమట్టుకు వచ్చింది?

డై:—ప్రథమపాదంలోనే ఉంది; తారల్ని బుక్ చేస్తున్నాం. ఇంకా తరవాయి ఉంటుంది.

జులు:—తరవాయి అలా ఉంటూనే ఉంటుంది లెండి! మీ 'అజంతా స్టూడియోస్' ఒక్కసారి మేం అంతా చూసే భాగ్యం మాకు లేదా ఏమిటి?

డై:—అయ్యో! ఎంతమాట! ఈ క్షణంలో రండి తీసుకువెడతా! మీ అందర్నీ ఏదో మంచి ముహూర్తం చూసి ఏ Mixed doubles లో నెగ్గినప్పుడో పిలుద్దామనుకుంటున్నా.

ప్రే:—(నవ్వేను.)

జులు:—Dynamite లాంటి భావం! ప్రేమ్జీ! డైరక్టరు Mixed Doubles కి పెట్టినదిపేరు. ఆయన రేకెట్ పట్టుకున్నాడంటే త్రినేత్రుడు దిగివచ్చినాసరే గడగడ లాడిపోవల్సిందే!

ప్రే:—ఔనౌను; తెలుస్తూనేవుంది పద్ధతి.

జులు:—అందులో శ్రీమతి రోజ్ తో కాంబినేషన్ వుందంటే వేరే చెప్పాలా?

ప్రే:—ట్రాఫీ లన్నీ వారి స్వంతం అన్నమాటే!

మధు:—మీరంతా మిత్రులు మా ఇల్లు పావనంచెయ్యడమే మాకు పండుగ.

రోజ్:—(కరుగ్గా) పుట్టినరోజు పండుగ!

మధు:—దయచేసి ఈ టీ పీల్చెయ్య ప్రార్థన. (అంతా నవ్వకుని టీపీల్చేస్తారు.) Next item in the Programme శ్రీమతి రోజ్ గానం.

ప్రే:—I second it.

జులు:—I third it.

డై:—O. K! పాడించాలి!

జులు:—ఉండండి! ఒకక్షణం ఆగాలి. ఈవేళ మధురం పుట్టిన రోజు పండుగ కనుక నేను కానుకలు చదివిస్తున్నాను.

ప్రేమ్జీ:—ఇవ్వరన్నమాట !

జలూ:—అదే చేస్తామయ్యా ! 1. డైరక్టర్ విశ్వనాధ్ గారు. Toilet Box బహూకరించారు. 2 ప్రేమ్జీ శ్రీమతి మధురంముఖచిత్రం చిత్రించి, చిత్రంగా Present చేశారు. 3. బాబుగారు ... (అని రోజ్‌ని తిలకించి) రోజ్ — గులాబీ అంటు చదివించారు. 4. శ్రీమతి రోజ్ ఒక్కపాటమాత్రం పాడిస్తారు.

రోజ్:—గానం.

ఎద విహంగమై పరుగిడసాగె
అనంత పథాన - అనంతపథాన॥ ఎద॥
మెరపుకన్నెలతో దోబుచిలాడి
మేఘమాలికతో హాసము చేసి॥ ఎద॥
అమృత కలశల నవనికి త్రోసి
గాలి కౌగిలిని కరగి మరగి॥ ఎద॥

ప్రే:—ఓహో ! అమృతంలాఉంది.

జలు:—Vimto Drink తాత లా ఉంది, పాట.

డై:—అమరగానం కూడా అందదు !

మధు:—ఆంధ్రాకర్ణ బాలా !

డై:—Nightingale of Melody !

ప్రే:—Greta Garbo!

రోజ్:—అక్షింతలు వెయ్యడం అయినట్టేనా? ఇంకేమైన తరువాయి ఉందా?

మధు:—కొంచెం తరువాయి ఉంది... నేను చాల సుదినం. నాచిన్న సన్మానం స్వీకరించి మాయందు దయయుంచి అల్పాహారవిందు కష్టపడి సేవించినందుకూ, శ్రీమతి రోజ్ గానమాధుర్యాన్ని ఆస్వాదించినందుకు మీఅందరికీ నాహృదయపూర్వక వందనాలు.

జులు:—ఇక ముందుకూడా ప్రతీ ఏటా ఇలాంటి పుట్టినరోజు పండుగలు జరిపి అతిథులంతా తగుశ్రద్ధ తీసుకొని నన్ను టీపార్టీలతో ముంచెత్తవలసిందని నాహెచ్చరిక ప్రార్థన కూడా!

(అతిథులు - Hear! Hear!! వినుడు - వినుడు,)

మధు:—ఒక్కటి తరువాయిగా Function పూర్తి అయినట్టే (జులూవంక చూచును.)

జులు:—ప్రేమ్జీ! నువ్వొక చక్కని భావగీతం వినరాలని మధురం అభిప్రాయం.

డై:—రైటో! ప్రేమ్జీ! పాడాలి.

ప్రే:—(గానం - 'నీ మధురగీతికల నీ సుధాచంద్రికల' - ప్రేమగీతి పాడును.)

డై:—Excellent గా ఉంది. (చప్పట్లు)

జులు:—ఎక్కడికి వచ్చినా ఆనవాయితి తప్పించావు కావు. స్త్రీ ఆరాధనా - ప్రేమగీతిని. [అంతా నిష్క్ర; తెర]

---

ద్వి తీ య రం గ ము.

[స్థలం:—మధురంస్వగృహం - అరడజను కుర్చీలు, రౌండు టేబిలు వగైరాలు వుంటాయి; స్వేఛ్ఛాప్రణయ సంఘ వార్షికోత్సవసందర్భంలో తాను అధ్యక్షిణిగా వుండి తీయుంచుకొన్న గ్రూపుఫోటో విలోకిస్తూ వుంటుంది; ప్రేమ్జీ - 'పుట్టిన రోజు పండుగ'నాడు మధురానికి బహూకరించిన 'ముఖచిత్రం' ఆ రౌండు టేబిలుమీద ప్రస్ఫుటంగా కనిపిస్తూవుంటుంది; స్పెన్సర్‌సిగార్ వెలిగించి పైకి నవరించుకుంటూ, చేతిలో గోల్డుఫ్లేక్‌టిన్ ' File తోసహా డైరక్టరు విశ్వనాథ్ ప్రవేశించి ఆపీనుడైన పిదప]

డై:—(వ్యంగ్యంగా) తదేక ధ్యానంలో చూస్తున్నట్టున్నారు ఫోటోకేసి...

మధు:—అబ్బే! మనం కలిసితీయించుకున్న 'గ్రూపుఫోటో' చూస్తున్నా; ఏమిటో విశేషం వుంటేనేకాని రారు... ...మహాత్ములు!

డై:—(పొగపీలుస్తూ, సగర్వంగా) నేను మొన్న రిలీజ్ చేసిన 'తలకాయి' ఫిలిమ్‌ని గురించి మీ అభిప్రాయం తెలుసుకుందామనివచ్చా !

మ:—స్వరవీణా, గానకిన్నెర, డైరెక్టర్ విశ్వనాథ్‌గారు ఫిల్ము తియ్యడం బాగుండక పోవడం కూడానా......

డై:—ఇల్లా అనడంకూడా ఒక పోలసీ అనుకుంటా.

మ:—అడిగారుకనుక చెబుతున్నా; మీ సంగీతం, దర్శకత్వం అమోఘంగా వున్నాయ్! రాళ్ళను కరగించి, మ్రోళ్లను చిగిరించే మీ అనురాగానం—మీ 'తలకాయి' ఫిలింలో చూశాను; చాల సంతోషం!

డై:—(మొహం చిట్లించుకొని) చూశారుగాని వినలేదన్న మాట ! .

మ:—ఎంతమాటా ! వినకపోవడమేమిటి ! మళ్ళీ దేనినైనా లేవతీస్తారా ?

డై:—(కంగారుతో) ఆ ! ఆ ! దేన్ని ? ఎవర్ని ? అరే......

మ:—(మందహాసంతో) అబ్బే ! ఫిలిమ్ గొడవ !

డై:—ఏమి సమయస్ఫూర్తి! మళ్ళీ "దెయ్యం"తీద్దామని అంతా సంసిద్ధం చేశాం.

మ:—సరి, సరీ...ప్రేక్షక లోకానికి మోక్షం ఇప్పిస్తుందన్న మాటే తమ Ghost; అడ్డు వచ్చానను కోకండి.

Excuse me ! ఆయా పాత్రలు ఎవరు నటిస్తారు, ఏ పద్ధతిలో ?

డై :—(బుర్ర గోక్కుని) అల్లాంటి వ్యవహారరహస్యాలు చాలా గోప్యంగా వుంచాలి. మధూ ! 'పంకజమల్లిక్' పాడిన Celestial song-hits నువ్వు పాడుతోంటే నేను మరో ప్రపంచంలో రెక్కలొచ్చి ఎగురుతాను.

మ:—మంచిపని చేస్తారు.

డై :—ఏదీ ఒక్కసారి—

మ:—కొంపతీసి నన్ను ఫిలిమ్‌లోకి బుక్ చేస్తారేమిటీ ?

డై :—నిన్ను 'బుక్' చేస్తా...... Educated ladies ని, పెద్ద ఫేమిలీసు లోంచి వచ్చినవాళ్లని ఏక్టు చేయిస్తే మన ఫిలిం పరిశ్రమ అభివృద్ధిలోకి వస్తుంది; అందులో మీ లాంటివారైతే......

మ:—అంతపనికి సాహసించకండి ! అయితే 'పంకజమల్లిక్'దే పాడాలా ? ఏ, "కృష్ణశాస్త్రి"గారి గేయాలో పాడ కూడదూ ? ఆంధ్రులు పనికిరారనుకుంటూ సినీమా ప్రపంచానికి ఆంధ్రా డైరెక్టర్లకీ !

డై :—మీలో రాష్ట్రీయత హెచ్చుగా వున్నట్టు తోస్తుంది.

మ:—ఆంధ్రేతరులని పైవాళ్లనీ బ్రహ్మరథంపట్టాలా ? పొరు గింటి పుల్లకూర - చేదుకూర బాగా రుచిస్తుంది, ఆంధ్ర సోదరులకి.

డై:—మధురంగారు 'ఆంధ్రాఫస్టు' అనుకుంటూ ... పోనీ ఒక్కటిమాత్రమే వినిపించండి.

మ:—చిత్తం! పాడతానుగాని చిన్నపరతుంది; నేనెల్లాపాడినా విమర్శించకూడదు. నా కామాత్రం స్వేచ్ఛ ఉంటేనే గాని .........

డై:—ఓ. కే; One, Two, Three! బిగిన్!

(మధురం, ప్రేయసి ప్రియుని రాకకై నిరీక్షించుటను తోచు గీతము పాడుతుంది; డైరక్టర్ చేతిబెత్తం తిప్పుతూ డైరెక్టుచేస్తున్నట్టు ఆనందిస్తాడు) ఓహో! 'కమలేష్‌కుమారీ' ఐపోవాలనా?

మ:—మీరు 'శాంతారామ్' అనిపించుకోవాలనా?

డై:—మధూ! నువ్వుపాడుతున్న పాట కర్థంతెలుసా?

మ:—ఆ! తెలుసు.

డై:—అయితే, చెప్పుచూద్దామ్.

మ:—అర్థంతెలుసునుగాని, చెప్పడంరాదు.

డై:—There you are! అల్లాచెప్పు! మహాకీలకం తెలిసిందిలే.

మ:—ఏమిటమ్మా? తెలుస్తేచెప్పు చూద్దాం! మహావూరిస్తున్నావ్!

డై:—నాకుచెప్పడం అంతగారాదు, చెయ్యడమేకాని; కార్యశూరుల కుండవలసిన లక్షణమే ఇది. ఇంతకీ వేడిరక్తం!

ఒడిదుడుకులు వస్తూవుండడం ప్రకృతినైజం. ... ...
కొద్దిగా నిగ్రహించుకోవాలి ...

మ:—(తీక్షణంగా):- అయోమయం డైరక్టరుగారూ! ఏమిటీ అంటున్నారు ?

డై:—నీపాటలో, నీమనోగత అభిప్రాయాన్ని తెల్పుతూ నీకోమలస్వాంది కండ్లలోంచి తొంగిచూస్తోంది; పాటలోవుండే...ప్రియసమాగమకౌతూహలాన్ని సువ్యక్తపరుస్తున్నాయి, నీ వీక్షవచనాలు...

మ:—(రౌద్రంతో) ఆగు! అక్కడితో తగ్గు! ఎమిటీ— నీ తలకాయ్ ధోరణి! ఫులిస్టాపు, కామా లేకుండా, ఊరికే 'Loud Speaker' లా వాగడమే? ఇదేమైనా 'స్టూడియో' అనుకున్నావా? ఇంకా మాటలు మిగులుతే మర్యాదా దక్కనివ్వను. 'స్త్రీ' అంటే ఏమనుకుంటున్నావో! ఆటవస్తువు, విలాసవస్తువు కాదు.

(అదేసమయానికి శ్రీ శ్రీ 'జులు' ప్రవేశించి డైరెక్టరుగారి అవస్థ-చిన్నపుచ్చుకోవడం గ్రహించి, పరిశీలనగా)

జు:—డైరెక్టరుగారూ! ఏమిటో 'మలేరియాప్రణయం' లో వున్నట్టు (ఆపీసుడై) కాళ్ళను వణికిస్తున్నారే ?

డై:—(సర్దుకొని కూర్చుని)అబ్బే! అల్లాంటి దేవీ కనిపించదే...

మ:—(నిష్కర్షగా) మీ మొగాళ్ళకున్న ఉప్పన్నబుద్ధే ఇది;

కొంచెం చనువుగా ఏవ్యక్తిఅయినాసరే స్త్రీతో మాట్లాడడంతరువాయి 'ఒరే! ఏదో ఉందిరా కథ!' అనెయ్యడం. ఎవరిదాకావస్తేనేకాని నిజస్థితి బోధపడదు.

జు:—నిజమే! అనుభవంలోకి వస్తేనేకాని ఏం తెలుస్తాయ్ !

మ:—పైగా, కొంచెం చనువిచ్చేసరికల్లా, కళ్లెం తగిలించి, పట్టపగ్గాలు లేకుండా, తమ నిరంకుశత్వాన్ని చెలాయిస్తారు, మొగసార్వభౌములు!

జు:—అయ్యో!

డై:—(మౌనముద్రవహించి file చూస్తూవుంటాడు.)

మ:—మీ మొగజాతి, మాజాతికి పగజాతి. నేనే రాణీనైతే; మొగపురుగు లేకుండా శాశించివుండేదాన్ని!

డై:—చచ్చాము! ఎల్లాగా ?

మ:—అంత చులకనా 'ఆడ' అనే శబ్దం ?

జు:—శివ శివా! ఎంతమాటా! మొగపురుగు లేకుండా తమరుమాత్రం 'రాణీ' ఎల్లాఔతారు!

డై:—అసంభవం!

జు:—ఇవ్వాళ 'మధురం' వాగస్త్రసంధాత్రిగా మారేరు; శిలాకాఠిన్యమంతా మీమాటలలో ప్రకటనమౌతోంది; ప్రపంచంలోవున్న స్త్రీత్వమంతా మూర్తీభవించి, ప్రళయతాండవ మొనర్చి, చిందులుత్రొక్కుతోంది మీనో

టనాని ... ఇంతకీ, ఇదంతా 'పశు...' ప్రభావం అనుకుంటా! ఏమంటారు డైరక్టరుగారూ?

డై:—ఊహాస్రవంతిలో మునగానాం, తేలానాం అంటున్నారు; ఏమంటారూ? ఏమి అనరు - అనదల్చుకోలేదు!

మ:—ఏమనగలరు; తప్పకుండా అంతే! చూడగా 'పశు' ప్రభావంలా కనిపిస్తోంది వాటం ... ... లేకపోతే ఈ మొండిసహాగ్రపిడివాదాలెందుకొస్తాయి - ఈపశువుల మధ్య నేనూ అంతే!

జు:—పొరబడుతున్నావ్! 'పశు...' ప్రభావం అంటే 'పశుపతి' వరప్రభావం! కనుకనే 'వాగస్త్రసంధాత్రి' గా మారుడమనీ భావం.

మ:—పశుపతిని పూజించేవాళ్లకి, ఆతనిబిడ్డలకు పశుత్వం వెన్నముకను పట్టివుండడంలో ఆశ్చర్యం ఏముందీ?

డై:—క్షమించాలి! అసలుభావం విడిచి పెడర్థాలు తీయడమనేది సభ్యతా, పెద్దమనిషి తరహా అనిపించుకోదు.

జు:—(వ్యంగ్యంగా) సమాజంలో యథేచ్ఛగా మసిలి, సంఘాన్ని సంస్కరించే ప్రబుద్ధులు వ్యక్తుల మంచిచెడ్డలను సరిగ్గా అర్థంచేసుకోవడం ఎంతో అవసరం.

డై:—అత్యవసరం.

మ:—అయితే నన్ను మీ రెవరూ సమంగా అర్థం చేసుకొన్నట్టు లేదు. నేను, నాజీవితాంతంవరకూ కన్యగా నేవుండి జీవయాత్ర గడిపి మరీ అవతారం చాలిస్తాను.

దై:—అయ్యో! పాపం!

జు:—ఏం చేస్తాము—ఎవడుతప్పించగలడు—విధివిలాసం!

మ:— (ద్విగుణీకృతా వేశంతో) మొగాళ్ళ నిరంకుశత్వానికి చోటు ఇవ్వను! బలికాను! ఆడుదానిపాలిటి 'నియంత'ల్లాగ చెలాయిస్తారు అధాటీ అంతా; స్త్రీలోవుండే మానుషత్వం గుర్తించక, స్త్రీని ఒకచరాస్తిగా భావించి అనుభవిస్తారు! తలతన్నిన సంఘసంస్కర్తలని పేరు ఇంట్లో సంస్కారం లేదుకాని, వీధిలో ఉద్ధరించడానికి బయిల్దేరతారు! వారి అర్ధాంగులను వంటింటికి పెరటిలో పశువులరాటకీ ముడిపెడతారు!

జు:—(దర్శకునుద్దేశించి, వ్యంగ్యంగా) పేపర్లో, ఈవేళ వాతావరణం ప్రశాంతంగా లేదు— తుపాను వచ్చే సూచనలున్నాయి అని ప్రకటించాడా?

దై:— ఏమో! ఫిలిమ్‌ఫీల్డుకి సంబంధించిన దేదైనా అడుగు 'Ever ready' గా చెబుతాను!

జు:—'రెడీమేడ్ మనిషి'లాగా? బాగుంది పద్ధతి!

మః—పోనీ, ఈబురఖాపెద్దమనుష్యుల్లో— "నేను నాస్త్రీకి స్వతంత్రమిచ్చాను" అనేవాణ్ణి మచ్చుకొకడ్ని చూపెట్టు! 'Bernard Shaw' అన్నట్టు 'పెళ్ళి' అనేది ఒక 'కాంట్రాక్టు'లా కనిపిస్తోంది! అంతకుమించి...

జః—మధురం! కొంచెం 'బ్రేక్' వెయ్యాలి!

'షా'గారు చెప్పినది పాశ్చాత్యులకే కాని మనకి ఎన్నటికీ వర్తించదు!

డైః—ఎంతైనా సృష్టిలోపంవల్ల 'స్త్రీ' మొగాడికి లోకువ! విద్యాబుద్ధులలోనూ, ప్రతిభలోనూ ఎంత మొగవాళ్ళతో పోటాపంతాలువేసినా మొగాళ్లు మొగాళ్లే!

జః—సృష్టికర్త అయిన ఆ దేముడిగాడిసంగతి కనుక్కోండి! ఆ అన్యాయం వాడుచేసినదే.

మః—దేముడు— God దర్శనమే బొత్తిగా దుర్ఘటమైపోయింది.

జః—పుణ్యాత్ములకి.

మః—ఏదేవాలయంలోనైనా కనిపిస్తే మొహం వాచేటట్టు ఓతట్టెడు అక్షింతలు వేసి పేలేసిఅడుగుతా! స్త్రీతత్వం వాడికి సరిగ్గా తెలియక ఇల్లాంటి ద్రోహం చేశాడు, మా వనితాలోకానికి!

డైః—(తలవంకించి, పెదవి విరచును.)

జు:—ఒకవేళ దేముడు గనక ప్రత్యక్షమయితే—మొగద్వేషి తమరని తెలిసి, మీకు జడిసి పరాథగానో అవతరిస్తాడు !

డై:—మీ ఒక్కరిదృష్టిలోనూ మొగాళ్ళు నియంతల్లా గోచరించారు; వనితాలోకం అంటే మీరొక్కరే కాదు.

జు:—అంతా మధురంలాంటివారే అయితే వేరేచెప్పాలా! ప్రపంచం అగ్నిపర్వతాలమయమైపోయి వుండును. వనితాలోకానికే కళంకం ఆపాదించడమనేది తగని సాహసం !

డై:—స్త్రీ సాహసం !

మ:—(రోషంతో) ఇరువయ్యోశతాబ్దంలో, ఈప్రజాస్వామికం రోజుల్లో, స్త్రీకి Voice, వ్యక్తిత్వమ్, నశించాయ్! మొగాళ్ళముందర మూగాళ్ళకంటే కనికష్టం అయిపోయారు స్త్రీలు; నికృష్టపు బ్రతుకు! నోరుండి లేకపోవడం. నేను నాసర్వస్వం వినియోగించి మా స్త్రీజాతికి స్వేచ్ఛాసౌఖ్యాలను సాధించితీరతాను. (మధురం చెర చెర నడిచి లోనికిపోవును.)

డై:—(ధైర్యంగా ఊపిరిపీల్చుకొని) మాశేషన్గావుంది—ప్రతిజ్ఞ!

జు:—(కుర్చీ దగ్గరగా ఈడ్చుకొని) 'దర్శకపాత్రా'! సృతిమించి రాగాన్నిపడింది, వరసచూస్తే. Tension

హెచ్చుగావుంది తీగెలు కూడా తెగేటట్టున్నాయి -
స్నేహతంత్రులు; వూరుకుంటే ప్రయోజనం లేదు!

డై:—మొగాడు మొగాడని ఒకటే పాటా! మొగద్వేషం
వున్న స్త్రీజన్మ వృథా!

జు:—బాగా సెలవిచ్చారు; ఒక సంసారం వుందనుకోండి -
కలో గంజో తాగుతూ చిలకాగోరింకల్లా మొగాడూ
ఆడదీ సంసారం ఈదినప్పుడే సంసారనౌక ఆవొడ్డున
చేరుతుంది. స్త్రీ, సంసారనౌకకు చుక్కాని లాంటిది;
చుక్కానిపట్టేవాడే పురుషుడు. తుపానులు చెలరేగుతూ
వుంటాయి; కాలవాహినిలో ఒడిదుడుకులు వస్తూనే
ఉంటాయి! గృహస్తూ, గృహిణీ 'కో' అంటే...

డై:—(పూర్తి చేస్తూ) 'కో' అన్నట్టు నిర్వహించుకోకపోతే.

జు:—సుడిగుండమే - పంచాగ్నిమధ్యమే!

డై:—నడిగోదావరే! వేరే చెప్పాలా? ఇంగ్లీషుచదువు
లొచ్చాక మరీ బరితెగించిపోయారు ఆడ వాళ్ళు!

జు:—అందులో ఈసినిమాలొచ్చాక మరీపాడైపోయారు;
బొత్తిగా అధ్వాన్నమయిపోయింది వెధవ ఫిలిం ఫీల్డు!
ఛండాలం 'స్టంటు ఫిలిమ్‌లు!'

డై:—ఫిలిమ్‌పరిశ్రమ అంటే ఉండేగౌరవం రొంతా పాడు
చేశారు కొందరు పెద్దలు బయల్దేరి!

జు:—డైరెక్టర్‌గారూ! పుష్పసౌరభ్యం, గాలిలో కలిసి పోవడానికేనా ఆ వికాసం?

డై:—కాదు! ఆఘ్రాణించటానికి...

జు:—అవునులెండి కాని, అసలు సృష్టిలోకంతా సహజ సౌందర్యరాశి స్త్రీ! భగవంతుని అపూర్వకళాసృష్టి. గృహంలో సృష్టి, స్థితి, లయాలు స్త్రీమీద ఆధార పడివున్నాయ్!

డై:—కనుకనే, స్త్రీ శక్తిస్వరూపిణి!

[మధురం ప్రవేశం]

జు:—(డైరెక్టరుతో మెల్లగా చెవిలో) మధురం వస్తోంది! వస్తోంది; (బిగ్గరగా) అందుకోసమే మనం స్త్రీలను పూజించాలి!

మ:—(విజృంభించి) మీధర్మోపన్యాసాలు, స్తుతిపాఠాలతో నా కవసరంలేదు. 'అమెరికా'లో ప్రకృతిశాస్త్రవేత్త లున్నవాళ్ళు, ఏవిషయంలోనూ మొగవాడి అవసరం కాని, జోక్యం కాని నా కక్కరలేదు.

జు:—ఘోరం! ద్రోహం!

డై:—Inhuman!

మ:—మన 'సాంఖ్య' శాస్త్రకారుడు పాశ్చాత్యశాస్త్రవేత్త లతో ఏకీభవించ లేదూ?

జు:—సృష్టి నిర్మూలానికే వాడికడుతున్నావ్! సృష్టిలో వుండే రమ్యతనీ, సత్యాన్నీ విధ్వంసంచేసి, మానవ జాతికంతకీ ఎన్నడూ మానని వ్రణం, మాయని మచ్చా సంప్రాప్తమౌతోంది!

డై:—అసలు మానవజాతిని పెంపొందించి అభివృద్ధిచేయ వలసిన విధి, విశ్వమానవజాత్యాభ్యున్నతికి చేయూత ఇవ్వవలసిన భారం, మధూ! మనఇరువురిదీ!

మ:—(కోపోద్రిక్తయై) Shut up! you fool! ఎంత మాటన్నావ్! నడవ్వోం అవతలకి! ఏయ్ 'ఆ+స్వామి'! సింహద్వారం చూపెట్టు ఈ మొగాళ్ళకి!

డై:—క్షమించాలి! వృద్ధిచెయ్యవలసిన భారం ఇరువురిదీ అనడంలో 'మొగ, ఆడు' వారని నాసద్భావం. కాళిదాసు "ప్రజాయై, గృహమేధినాం" అన్నాడు. శెలవ్!
(మధురం, రుసరుసలతో లోనికి లేచి నిష్క్రమించును; డైరెక్టరు, జులులు తాపీగా కల్లాంటి 'కొరడాస్త్రీ'లను ఏంచేసినా పాపంలేదు! మహిళాలోకానికే అప్రతిష్ఠ

జు:—ఇంకా నెమ్మదిగా అంటారేమిటి! ఈ సకల స్త్రీలని ఆఖరికి 'ఇస్త్రీ' చేసినా వారి హృదయకాఠిన్యం, మాలిన్యం, చపలత్వం నిర్మూలం అవవ్!

డై:—(కసిగా) కాల్చివాతలుపెట్టినా...

[జులూ ముందు, డైరెక్టర్ కొద్దివెనుక నడుస్తూవుంటారు. జులూ చూడకుండా టేబిల్ మీదవున్న- 'ప్రేమ్జీ' మధురానికి పుట్టినరోజు కానుకగా బహూకరించిన "ముఖచిత్రం" తాలూకు ఫోటోని డైరెక్టర్ జేబులో వేసుకుంటాడు; జులు, డైరెక్టర్లు నిష్క్ర. తెర.]

---

## తృతీయరంగము.

[స్థలం:- స్వేచ్ఛాప్రణయసంఘం ఆవరణలో ఏకాంతస్థలం. 'మధూ' 'ప్రేమ్జీ'ల ప్రణయం.]

ప్రే:—(మధునుద్దేశించి) ఓహో! 'రోమియో, జూలియట్'ల దివ్యప్రేమ! గీత గోవింద కృష్ణకర్ణామృతము లందలి శ్రీరాధామాధవ లీలావిలాసం! అబ్బా! అనిర్వాచ్య ఆనందాన్ని ప్రసాదిస్తాయి! ఔనా? మధూ!

మ:—ఏమో! కాబోలు .........

ప్రే:—గోపికావృతమైన ఆ మోహనమూర్తి! ఆబృందావన సోయగం! ఏమీ ప్రణయమహిమ! ప్రేమ! సర్వం ప్రేమమయం .........

మ:—ప్రాణంలేని ఫోటోలను సహితం ప్రేమించేప్రముఖులను ఏమనాలి?

ప్రే:—ప్రేమించటం లేదు ! ఆరాధిస్తున్నాను

మ:—అసలు ప్రేమించటమే ఒకతప్పు; అందులో ఆనందించ డం, అనుభవించటం ఘోరం! ఒకవేళ నిజంగా గోపికలు అవతరిస్తే ఏంచేస్తారో ! ఏంచేసేవారో ?

ప్రే:—వాళ్ళి ఆరాధిస్తాను; పూజిస్తా ! వారు కృష్ణునిపై చూపిన అనంతప్రేమకు వారు పూజార్హులు ! ప్రేమ, ఆరాధ్యదేవత ! మానవుల భావోన్మాదుల నొనర్చి చిందులు త్రొక్కించేస్తుంది, ఆవిశ్వప్రేమ !

మ:—ఏమిటా చిందులు త్రొక్కటం ! ప్రేమిస్తా ! కొంపతవ్వి ఏప్రేమ—దెయ్యమైనా మిమ్మల్ని ఆవహించలేదుకదా?

ప్రే:—ఆ ! ఇదిగో ! ఆవహించింది ... బాబోయ్ ! ఎల్లాగ ? పర్యవసానం ! ఈవిచిత్ర ప్రకృతి, ఈ తేజోమూర్తి, ఈ దివ్యమంగళవిగ్రహం—నన్ను పీడించుకు తింటోంది !

మ:—(చిరునవ్వు విరులువిసురుతూ) ఐతే, మీరు ప్రేమోపాసకులా, లేక ......... విగ్రహారాధకులా ?

ప్రే:—ఆరాధకుడను ......... ఆహా ! ఆ అనంతతారామండలం ! రమ్యాతిరమ్యమై అత్యంతసౌరభ్య గరిమచే ప్రకాశించి, చిరునవ్వు నరులతో ఆహ్వానించే ఆకుసుమగుచ్ఛాలు ! చూడు ! మధురం ! ఈప్రకృతిశోభ నన్ను

పిచ్చివాణ్ణిగా చేసేస్తోంది! నాలో ఒకవిధమైన ఆర్తి!—
దాహం!

మ:—(ఎగతాళిగా) 'ప్రేమ - దాహం' ఎక్కువైతే వడకొట్ట
కలదుసుమా! అయ్యో! ఎల్లాగ?

ప్రే:—ఆదర్శజీవులకు, ప్రేమజీవులకు ఈప్రపంచంలో స్థానం
లేదు!

మ:—అట్టే గట్టిగా ప్రేమనుగురించి మాట్లాడితే Arrest
చేస్తారు! జాగ్రత్తసుమా!
(వధూ, ప్రేమ్జీలు నవ్వుకొంటూరు; ప్రేమ్జీ జయదేవ
ప్రణయగీతిక ఒకపల్లవి స్ఫురించినట్టుగా పాడును.)
ప్రేమ్జీ! ఎవరి దీపాట? కృష్ణుడిదా?

ప్రే:—ప్రియునిది! ఏకాకిది! పిచ్చివాడిది!

మ:—ఏమిటీవింతధోరణి? ప్రేమ్జీ! మీఆదర్శం నాకు
నచ్చింది; స్వేచ్ఛకిస్వేచ్ఛా, ప్రేమకిప్రేమా - స్వేచ్ఛా
ప్రణయం! గొప్పసంస్కారం!

ప్రే:-(భావగర్భితంగా) స్వేచ్ఛలోకూడా నిర్బంధాలుంటాయ్!
బ్రహ్మచర్యం, కన్యాత్వం మంచివి; చాలా ఈతిబాధలు
తప్పుతాయ్! పెళ్ళి అనేది ఒక పెద్ద పెనుభూతం! నిత్య
చెర! పరాయివాళ్ళకుకూడా పెళ్ళొద్దు! మహాప్రభో!
వద్దు! — ఈదాస్యం ......

మ:—మీరుచెప్పినది నిజమే! నే నేకీభవిస్తా: ఎక్కడో గొప్ప మెట్టవేదాంతం నేర్చారే!

ప్రే:—సహవాసదోషం! — కాదు! సహవాసలాభం!

మ:—ఈప్రకృతి ఎంత మనోహరంగావుంది! పువ్వులు, కాయలు, పళ్ళు! ఇవన్నీ ఈకాలంలోనే ఎందువల్ల శోభిల్లాలి ప్రేమ్జీ?

ప్రే:—ప్రకృతిసిద్ధం! ఋతుధర్మం! పైమువచ్చేసరికల్లా 'తీగ' ప్రాకేటందుకు ఆధారంవున్నా లేకపోయినా దేనినో అల్లుకొని పైకి ఎగబ్రాకుతుంది! ఎవరు అడ్డుపడగలరు? ప్రేమప్రవాహానికి - ఎదురు! తీవ ఎగబ్రాకెదువేళ గనక ......

మ:—ఆహా! అల్లాగా? పువ్వు ఎందుకు వికసించాలి?

ప్రే:—తేనెటీగకొరకు - ఆస్వాదనకొరకే - దానినైజం......

మ:—నేత్రానందానికి కాదూ?

ప్రే:—ఊహూ! కాదు! ఆపువ్వు తనవిద్యుక్తధర్మాన్ని నెరవేర్చుకొనేటందుకే వికసించి 'భృంగరాజు'ను ఆహ్వానిస్తుంది!

మ:—అబ్బా! ఏమిభావం!

ప్రే:—'మధుర' భావం!

మ:—ఈవింతసమాధానా లెందుకో?

ప్రే:—ప్రశ్న లెందుకో అవీ అందుకే — మధూ! జీవనదీప్రవాహం ఎన్ని అడ్డంకులు వచ్చినా, పొరలి పొరలి, సముద్ర సంగమాన్నికై తహతహలాడిపోతుంది!

మ:—ఆ నది పరిగెత్తుకొనివచ్చి మీతో మొరపెట్టుకుందా?

ప్రే:—అల్లాగే యౌవ్వనం - ప్రేమా, తపించిపోతాయ్!

మ:—(కిలకిల ధ్వానము ఆలకించి) అబ్బా! రణగొణధ్వని! హోరు!

ప్రే:—ఎక్కడా?

మ:—అక్కడ–చెట్టుమీద–ఏమిటాకోకిలా?

ప్రే:—కోకిలగోలా! బాగుంది! భరించలేరు విరహిణులు!

మ:—అస్తమానం "కుహూకుహూ" అంటూ వెర్రెత్తినట్టు అలా గోలపెడుతుందేమిటి చెప్మా!

ప్రే:—'మధుర' గీతికాస్వాదనకి; పాపం! 'చిన్నారికోకిల'— తన ప్రియుడి కోసం నిరీక్షిస్తూ విసిగి, వేసారి, 'కుహూ కుహూ' అంటూ విరహవేదనలో నలిగిపోతోంది! మధూ!

మ:—ఔను; 'పొన్నారిపిల్లి', మార్జాలకాంత, 'మ్యావ్, మ్యావ్' మంటూంటే—ఆపిల్లి కంఠస్వరంలో, కొందరు ప్రేమోపాసకులు–వారి 'ప్రేయసి' కోమలగాత్రం విని, విరహంతో మంచమెక్కుతారు!

ప్రే:—బాగుంది ఎగతాళి—నిజంచెబితే నిష్ఠూరం! నాకెం దుకూ.

మ:—చాలా గొప్పభావం విసిరేశారు! మీకు ఈప్రపంచ మంతా విరహంలో భోరున ఏడుస్తున్నట్టు తోస్తుంది; ఆక్షేపణ ఏమీలేదు!

ప్రే:—ప్రేమ—విరహం, వెలుగు—చీకటి, అమృతం—హాలా హలం—ఇవన్నీ సమస్తజీవరాసులకు ఒకేవిధమైన అను భవాన్నిస్తాయ్! కాలం ఒక్కటే! గతి భేదంకాని.

మ:—మాయాకాలం! మాయమనుష్యులు! ప్రేమిజీ! ఈ ప్రపంచంలోకల్లా మధురాతిమధురమైన వస్తువేమిటో చెప్పుకో గలరా?

ప్రే:—ఆ! మహారాజులాగ!

మ:—ఐతే... చెప్పండీ!

ప్రే:—ఆ! మధురం—అతిమధురమైనదా—భావగీతం.

మ:—కాదు.

ప్రే:—స్త్రీహృదయం!

మ:—ఊహూ! కాదంటే.

ప్రే:—(ఆలోచించి) రసగుల్లా! ఔనా?

మ:—అబ్బే! చెప్పుకోలేరు!

ప్రే:—ప్రేమా?

మ:—ఛీ ! ఛీ ! కాదంటుంటే.

ప్రే:—(దీర్ఘంగా ఆలోచించి) ఈమాటు చెప్పకోనా ?

మ:— ఊ ! సరే ........

ప్రే:—ఛీ ! ఛీ ! ఛా ! ఛా !

(ఇరువురూ కిలకిలనవ్వుకొని భావప్రకటనతో గాన మొ నర్తురు.)

గానం.

జీవితయాత్రా ఆరంభమాయె
నూతనశోభా నర్తనమాడ॥ జీ॥
ఆడి పాడే కోకిల రవమే
అమృతవీణా మీటే॥ జీ॥

మ:—కథ ఇల్లామళ్ళిందా ! ఏమిటో అనుకున్నాను.

ప్రే:—ఔను; త్రిప్పతే తిరగక ఏమాతుందీ ?

సంతత తన్మయ జీవనమే
సాగింపవోయీ యువకా॥ జీ॥

[మధూల ప్రేమ్జీ, నిష్క్ర. తెర.]



# ప్రణయసామ్రాట్.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

[స్థలం:—స్వేచ్ఛాప్రణయసంఘం క్లబ్; నాడు ముసురు. అనంతాకాశమంతా పగలే 'Black-out' ఐపోయింది. దిక్తటములన్నీ మహాశూన్యంతో నిండి 'ప్రపంచం మిథ్య' అని మానవమాత్రులకు ప్రబోధిస్తున్నాయి, ఏకైక కంఠంతో. ప్రేమ్జీ ఒక్కడు తనగది కిటికీవద్ద నిలబడి ఆ శూన్యాన్ని తన నిశితదృక్కులతో భేదిస్తూ, ఉరుము ఉరుముకీ, మేఘగర్జనకీ దద్దరిల్లుతూ అకారణమైన ఆవేదనకు ఆహుతి ఔతున్నాడు. గోడనున్న తన ఫొటో గాలినిరంకుశత్వానికి గురియై క్రింద పడింది; కాని పగిలిపోలేదు. ఇంతట్లో డైరెక్టరు విశ్వనాథ్ ప్రవేశం.]

డై:—హల్లో! ప్రేమ్జీ! చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నట్లున్నారు...

ప్రే:—(సీరియసుగా) చాలా తీక్షణంగా ఆలోచిస్తున్నాను ఒక విషయాన్ని గురించి!

డై:—Wish you good luck ! ఫలిస్తుందిలెండి......

ప్రే:—ఏమిటి ? ఎందుకు... దేనికి ?

డై:—మీరు ఏవస్తువుకొరకైతే ప్రయాసతో అహోరాత్రా లు ఆలోచిస్తున్నారో - తపస్సు చేస్తున్నారో - ఆ గగన కుసుమం మీకు లభించాలని నా కోరిక !

ప్రే:—మీ సహృదయానికి చాలా థాంక్సు ! సభ్యులెవరూ ఇంకా అవతరించలేదే ?

డై:—ఈ వేళ ముసురు కదూ...చీదరగావుంది. అందుచేత 'రోజ్' వగైరాలు రారేమో !

ప్రే:—ముసురులో వచ్చి ఆదుకునేవారే చాలా తక్కువ...

డై:—నే వచ్చానుగామరి- ఐతే నేను......

ప్రే:—(హాస్యంగా) మీరే 'ముసురు' ! మీతో ముసురును కూడా క్లబ్‌లోకి ప్రవేశపెట్టారు. సామాన్యులా డైరె క్టరుగారు !

డై:—ప్రేమ్జీ ! సిటీప్రోపర్‌కి క్లబ్ విసిరి పారేసినట్టుగా వుంది; కాళ్లు ఈడ్చుకుంటూ వచ్చేసరికే ఔతుంది; అందులో ఈచినుకూ, చీదరలో ఇంతదూరం ఈడుకు రావద్దూ !

ప్రే:— (వ్యంగ్యంగా) డైరెక్టర్‌గారూ ! మిమ్మల్ని చూస్తే నాకు బ్రహ్మానందం కలుగుతుంది !

డై:—ఇదొకటా-కారణం ?

ప్రే:—మీరు స్వేచ్ఛాప్రణయసంఘ ఆశయాలను జీర్ణించుకొని ప్రత్యక్షంగా నిత్యజీవితంలో అనుచరిస్తూ, ప్రబోధిస్తూ, మార్గదర్శకులై ఆదర్శపురుషు లనిపించుకుంటున్నారు.

డై:—ఏమిటీ వింతధోరణి ! ప్రేమ్జీ !

ప్రే:—(ఉద్రేకంతో) మీ కండరాల్లో 'స్వేచ్ఛాప్రణయరక్తం' ప్రవహిస్తోంది ! నామాట నమ్మండి-అంతే !

డై:—(తాపీగా) ప్రేమ్జీ! ఐతే మధురం పుట్టినరోజు పండుగనాడు మీరు పాడిన ప్రేమగీతానికి అర్థం ఏమిటండీ ? కాస్త Enlighten చేద్దురూ !

ప్రే:—ప్రేమగీతానికి భావమేకాని అర్థం ఉండను.

డై:—పోనీ భావమే అయిరి... ... ...

ప్రే:—అగాధమైన హృదయంతో అనంతదృష్టితో చూస్తే తెలుస్తుంది.

డై:—ఆ అగాధం మాకు అందదన్నమాట ! ప్రేమ్జీ ! మీకు చిత్రలేఖనం, Painting, బాగా వచ్చునే ! చేతిలో కళ వుంది.

ప్రే:—అంతే! జీవితంలో కళ లేదు! మీ రెప్పుడు చూశారు

వైై:—మీరు శ్రీమతి మధురానికి ప్రెజెంటు చేసిన 'ముఖ చిత్రం'లో మీ నేర్పరితనం చూశా ! అబ్బా ! మధు రం......(వికటంగా నవ్వును)

ప్రే:—(విస్తుపోయి) మధురం ఏం చేసిందీ-ఏమైనా...... అసభ్యంగా...మాట్లాడిందా ?

వైై:—అందుకు సందేహమా ! మాటలోనూ అంతే క్రియ లోనూ......

ప్రే:—విశ్వనాథ్ ! నిగూఢంగా మాట్లాడితే ఏమి తేలుతుంది ...కనుక తెలిసేట్టు తెలియపరుస్తే బాగుంటుంది.

వైై:—ఐనా మాకెందుకు......మీ స్నేహం...మీ రంతా స్నేహితులు ! కావలసినవారు !

ప్రే:—మీరు మాత్రం కాదూ ? స్నేహానికి అపచారంచేస్తే నే సహించలేను !

వైై:—మీ స్నేహానికి ద్రోహమే చేసింది. చెప్పడంకూడా స్నేహధర్మం కాదు.

ప్రే:—అవసరమైనప్పుడు, మిత్రునికే ద్రోహం తలపెట్టినప్పుడు విపత్తు నివారించడం, సవ్యంచెయ్యడం మీ ధర్మం కాదూ ?

డై:—స్నేహపాత్రుడను కనుకనే చెబుతున్నాను; అయితే-(ఫొటో పైకితీసి) ఇదుగో ఇదేమిటో ఒక్కసారి చిత్తగించండి ! (మధురం ముఖచిత్రం చూపును.)

ప్రే:—(నిర్ఘాంతపోయి శూన్యదృక్కులు ఫొటోపై ప్రసరించి) ఎక్కడిది ?

డై:—ఇంకెక్కడిదీ-మధురం దగ్గరిదే !

ప్రే:—మీ కెక్కడిదీ...ఎల్లా వచ్చింది ?

డై:—ఆమె స్వహస్తాలతో ప్రసాదించినదే ఇది......

ప్రే:—మధురం...మీకు ఇచ్చిందా ? మీకు......

డై:—ఔను; ఆ ఇల్లాలే ఈ ముఖచిత్రాన్ని నాకు బహూకరించింది; మధురం నీయెడల దొంగప్రేమ నటిస్తోంది.

ప్రే:—నాయెడలా ? నేను...ఆమెను ... ప్రేమించానా ? లేదు ! లేదు !

డై:—ఏమైనా స్త్రీ హృదయం దుర్భేద్యం ! ఎండమావులను చేరితే దాహం తీరుతుందా ప్రేమిజీ ?

ప్రే:—(తల్లడిల్లి) అసలు దాహం అంటూ ఉన్నవాళ్ళకి!-అంతా మాయ ! మృగతృష్ణల ఇంద్రజాలమైపోయింది ఈ ప్రపంచం ! ప్రేమశూన్యగేహం ! సరే ! ఇప్పుడే వస్తా—మీరు ఈలోపుగా పేపరు చూస్తూండండి.

(ప్రేమ్జీ నిష్క్రమణ, ఆ వెనుకనున్న గార్డెన్ లోకి-ఆశూన్య ప్రకృతే ప్రేమ్జీలాంటి వ్యక్తులకు శాంతినిచ్చేది-సేద దీర్చేది-అంజనం !)

(శ్రీమతి 'రోజ్' ప్రవేశం.)

రో:—(ఆసీనయై) నమస్తే ! విశ్వనాధ్ ! న్యూస్ పేపరు విశేషాలు ఏమిటో ?

డై:—ఇదిగో న్యూస్ ! శ్రీమతి 'రోజ్'గారికి సినిమా ప్రపంచంలో మంచి భవిష్యత్తు వుంటుందనీ, దయచేసి నటించి కళాసేవ చెయ్యమనీ, సంపాదకీయలేఖల్లో ఎవరో ప్రముఖులు వ్రాశారు.

రో:—గొప్ప ప్రముఖులు బయల్దేరారు; మనం చేసేది 'కళాసేవ' కాదు-'కళాయిసేవ' ! ఎంతసేపూ ఖానా ఔర్ బాతాఖానీ......

డై:—రోజ్ ! ఈ ముసురులో మెరుపులా ఎగిరి చక్కా వచ్చావ్ !

రో:—పిడుగు దగ్గర మెరుపు ఉండడంలో ఆశ్చర్యమేముందీ?

డై:—రోజ్ ! మధురం పుట్టిన రోజునాడు నువ్వు హృదయం విప్పి ఎగిరి గంతేసి పాడినపాట ఇప్పటికీ నా చెవిలో ప్రతిధ్వనిస్తోంది. ఆ మధురగానమే నన్ను సీఖైదీగా చేసింది. ప్రేమబందీని అయాను.

రో:—(టకాయించి లేచి నిలబడి, జైలరులాగ, ఉరిశిక్షవిధించే న్యాయాధికారి లాగ, హావభావాలు అభినయిస్తూ డైరెక్టర్ చేతిలో Stick లాక్కుని Revolver pose లో పెట్టి...) ఏయ్! ఖైదీ! Hands up! నుంచో!

డై:—(బందీవలె నయభయములతో నటించుచు)

రో:—నీకు నేను కఠినశిక్ష విధిస్తున్నాను! నువ్వు చేసిన ద్రోహానికి-ఘోరహత్యకి. నీ కర్మం-నే నేం చెయ్యను.

డై:—(సవినయంగా) చిత్తం! హుజూరువారి ఆజ్ఞ! నే నిరపరాధినని మాత్రం మనవిచేసుకుంటున్నా! Your Highness! త్వరలో నన్ను కటాక్షించాలి!

(ఇరువురు కిలకిల నవ్వుకొందురు.)

రో:—విశ్వనాథ్!

డై:—ఆ మొదటి రెండక్షరాలూ తీసేసి పిలుద్దూ!

రో:—అబ్బా! ఎంత ఆశ! ఔనుకాని, చూశారా! ప్రేమ్జీ మధురాల స్నేహం ఎల్లా పరిణమించిందో—ప్రేమ్జీ అంటే మధురానికి ఎంతో అభిమానం...

డై:—(తెలియనట్లు నటిస్తూ) ఏమిటీ! ఆ మొగద్వేషికా? చిత్రంగా వుందే.

రో:—చాలాదూరం వెళ్ళింది కథ!

డై:—ఆ! ఏమయిందేమిటి? మరేమీ సీరియస్ గా లేదు కదా వ్యవహారం!

రో:—(ఆతృతతో) వార్షికోత్సవానికి ఈవిడ ప్రెసిడెంటుగికీ అలంకరించడం...ప్రేమ్జీ, పుట్టినరోజుపండుగకి కానుకలు సమర్పించడం - ఒగేమిటీ...

డై:—గ్రంథం చాలా పెరిగిందన్నమాట!

రో:—పెంచుతే పెరగదూ?

డై:—అయితే మరేమీ Regular farce, నేత్రావధానం, గట్రా జరగడం లేదుకదా?

రో:—నిరాఘాటంగా జరుగుతున్నాయి; పరస్పరంగా క్రీకంటి చూపులు కలుసుకోవడం-కళ్ళు మాట్లాడటం...చిరునవ్వుపిలుపులూ.

డై:—(మాటత్రుంచేసి) రోజ్! నువ్వు చక్కగా వర్ణిస్తున్నావ్! పోనీ ఏదైనా ఫిలింకి చక్కనికథ - Dialogues తో సహా వ్రాసి ఇవ్వకూడదూ? 'స్నేహప్రభలాగ'

రో:—అయినా, 'కథకులు' కథలు వ్రాస్తే బాగుంటాయ్! మేము ఒకలెఖ్ఖా!

డై:—మొన్న షూటింగులో ఏమయిందంటే......

రో:—అబ్బా! ఎప్పుడూ సినీమాపిచ్చే-'షూటింగ్' ఎప్పుడా

ఎక్కడా, అని తహ తహ లాడిపోతారు, ఈ డైరెక్టరూ మానవులు !

డై:—కాబోయే సినీమా తారలూ అంతే !

రో:—సరే ! అన్నట్టు ప్రేమ్జీ ఏమైనట్టు ?

డై:—ఇక్కడ లేనట్టు తోస్తుంది; ప్రేమ్జీకి మధురం విషయంలో చిన్న పంచదారమాత్ర పారేశా ! అదప్పుడే పని చెయ్యడం ప్రారంభించి, 'Thousand potency' ప్రభావం చూపెడుతోంది; దానితో మన్నుతిన్న పాములా ఐపోయి, మొహం వాలేసి అవతలకు నడిచాడు.

రో:—పాపం ! ఆ అమాయకుడిమీదా మన ప్రభావం చూపెట్టడం ?

డై:—చాలా జాలిపడుతున్నట్టున్నావ్ ఆత్మీయులకోసం !

రో:—చాలించండి ! అతిధోరణి ! నే పోతున్నాను.

డై:—నేనూ వస్తా నంటుంటే - అరే ! కంగారూ !

రో:—తాపీమనుష్యులు-సాగించండి !

(డైరెక్టర్, రోజులు నిష్క్రమణ - 'జులు' ప్రవేశం)

జు:—ప్రేమ్జీ ! ప్రేమ్జీ ! ఎవ్వరూ లేరే !

(ప్రేమ్జీ చిరాకుగా - ప్రవేశం.)

జు:—ఏం ! అల్లావున్నావే - దీనవదనంతో ?

ప్రే:—ఇందాకటి నుంచీ గార్డెన్‌లో కూర్చున్నా.

జు:—ఈ Bad weather లో - ముసురు లోనా ?

ప్రే:—ముసురు విడిపోయింది ! వెళ్ళిపోయింది ! నీరాకతో నాహృదయానికి ప్రభాతమయింది. హాయి నిచ్చింది. డైరెక్టర్, రోజు ఇప్పటివాకావుండి వెళ్లినట్టున్నారు... కొంచెం తలనొప్పిగా ఉంది.

జు:—వుంటుంది; ఆవిడ వెళ్ళిపోతే అల్లాగే వుంటుంది.

ప్రే:—అభం, శుభం లేకుండా అస్తమానం వేళాకోళమే ?

జు:—ఇప్పటికు వచ్చినప్రమాదం ఏమిటీ అంట! నీకేం? రాజా! ఒకచో 'రోజ్' - వేరొకచో 'మధురం'! Two birds at one shot! లా వుంది; సాక్షాత్తూ 'ప్రణయసామ్రాట్' వోయ్ !

ప్రే:—వేటకానినే సింగపుకొదమ మింగేస్తే - ఏంచేస్తాడూ ?

జు:—చచ్చి వూరుకుంటాడు ! దీనికి పెద్ద ఆలోచన కావాలా? ఏమిటా నిస్పృహ ! విషాదం ! నీవిచారాన్ని నాకు Inject చేస్తున్నావ్ ! మనస్సులోవున్న బాధ స్నేహితుడితో చెప్పుతేనే ఎక్కడ విముక్తి ఐపోతుందేమో అని భయం కాబోలు !

ప్రే:—విరహంలో ప్రేమవున్నట్టు బాధలో మాధుర్యంవుంది!

జు:—అయితే, నాలాంటియోగ్యుడు 'నువ్వు ఎప్పుడూ బాధ

పడుతూవుండాలి గాక !' అని దీవిస్తే నీకు హాయి అనుకుంటా.

ప్రే:—అల్లాగే దీవించాను అనుకుంటా మహానుభావుడు డైరెక్టరు ఘటం !

జు:—అనుకొన్నంతపనీ చేశాడూ ? ఏం తవాయి తీసుకొచ్చాడూ ?

ప్రే:—(కటుకుగా) నేను మధురానికి ప్రెజెంటుచేసిన — పుట్టినరోజు కానుక ! కానుక ! మధురం ముఖచిత్రం తీసుకొచ్చాడు...

జు:—తీసికొచ్చి ?

ప్రే:—"మధురం నాకు బహూకరించింది, చూశావా ? ఎంతటి మహాఇల్లాలో ! నీమీద కృత్రిమప్రేమ నటిస్తోంది" అన్నాడు.

జు:—ఆ ! ఏమిటీ ! నిజంగా ?

ప్రే:—రోజుల మహాత్యం !

జు:—'రోజు'మహాత్యం ! —

ప్రే:—కాలవైపరీత్యం ! అతని మాటలు నే విశ్వసించలేదు కాని...

జు:—శుద్ధకల్ల ! నమ్మడానికి వీల్లేదు ! పోనీ, కీడెంచి మేలు ఎంచుదా మన్నట్టు - ఒకవేళ 'మధురం' ఏసందర్భంలో

నైనా నిన్నుగురించి చులకనగా, హాస్యాస్పదంగా మాట్లాడిందా అంటే అదీ కనిపించదు. నువ్వంటే ప్రాణం ! నీపేరుచెబుతే మహానందపడిపోతుంది.

ప్రే:—పేరు చెప్పినంతమాత్రాన మహానందపడేమనిషి, నే నిచ్చిన కాన్క - ఫొటో, డైరెక్టర్‌కి ఎలా ఇచ్చింది ? ప్రత్యక్ష నిదర్శనం కనిపిస్తుంటే ఎల్లాగ త్రోసిరాజనడం?

జు:—ప్రేమ్జీ ! నీ అభిప్రాయం మార్చుకోవాలి ! ఈవిష యంలో మధురం అమాయకురాలని ఘాఢీగా చెప్ప గలను. ఈ కుతంత్రం డైరెక్టర్, రోజ్ - ఇద్దరిలోనే వుండితీరాలి ! తొందరపడి మధురాన్ని కదల్పకు ! జాగ్రత్తగా ఎప్పటిలాగే వ్యవహరించు! నిజం దాగదు! నిలకడమీద తేలుతుంది ! రోజ్ ! జాగ్రత్త !

[ప్రేమ్జీ, జులు నిష్క్రమణ - తెర.]

---

ద్వితీయరంగము.

[స్థలం:—"అజంతా స్టూడియోస్"—డైరెక్టర్ 'విశ్వనాధ్' ఫిలిమ్ ఫీల్డుకి సంబంధించిన పుస్తకాలు తిరగేస్తూ Revolving chairలో కూర్చొని 'పఫ్' చేస్తూవుంటాడు; ధూమ కేతు కవిసార్వభౌమ, మధురం మేనమామ 'శ్రీక్రొమ్మన' చేతిలో 'Screen script' తో సహా ప్రవేశం.

గదిలో సిగరెట్టుకళేబరాలు విచ్చలవిడిగా షచారుచేస్తూం టాయి, గాలికిఎగురుతూన్న బూజుదేవతసాన్నిధ్యంలో.]

క్రో:—(చేతులు జోడించి) 'సు-ప్రభాతం !' దర్శకాగ్రణీ !

డై:—Oh! What's it! సు-ప్రభాతమా ? ఓహో ! 'గుడ్‌మార్నింగ్'కి అనువాదం కాబోలు; మహాబాగా వుంది ... 'గుడ్ ఈవినింగ్'కీ, 'గుడ్ నైట్'కీ ఏమం టారు కవీజీ ?

క్రో:—(విజయోత్సాహంతో) "సు-సాయం"–"సు-నిశి" అన వల్సుంటుంది.

డై:—సు-ప్రభాతం అన్నట్టు 'సు-అస్తమయం' అనకూ డదూ ? 'సు-నిశి' కంటె 'సు-మసి' అంటే బాగా వుండిపోను. దాంట్లో ఓవిధమైన నవీనత వుండును. అనొచ్చా ?

క్రో:—(చేతులు నులుపుకొంటూ) మహాబేషుగ్గా అనొచ్చు ! అదంతా మనచేతుల్లోవుంది. 'భాషాలలామ' నేను ఎల్లాచెబుతే అల్లాగ అక్షరాలా నడవవలసినదే! స్వతం త్రించి సారస్వతంలో ప్రయోగించినపదాలు అలా కలకాలం వుండిపోతాయ్ ! అందులోనూ ఫిల్ములో కెక్కితే యుగయుగాలకీ శిలాశాసనాల్లా పడివుం టాయ్ ! 'నిరంకుశాః కవయః' కదండీమరి ...

డై:—(వికటంగా) అయ్యో! కాదండీమరి - కవులు ఒక్క నిరంకుశులు మాత్రమే కారు. అంకుశులు, ఉన్మాదులు కూడా! కవులు, ఉన్మాదులు, ప్రేమీప్రేమికులు - వీళ్లంతా భావావేశంలో భావోన్మాదులే, ఒక్కటే సజ్జు అని 'Shakespere' మహాకవి, కవికుమారు లను గురించి అభినందించాడు.

క్రో:—డైరెక్టర్లకి కూడా కవిహృదయం, భావనాశక్తి వుండా లేమోకదండీ? అందుచేత ...

డై:—కొందరు కుశన్నగాళ్ళు, యతిగాళ్ళూ నశిస్తేనేగాని ఏ ఫీల్డు బాగుపడదు; పిచ్చిపిచ్చివ్రాతలు వ్రాసే తల కాయల్ని పురంపెట్టినా తిరిగి తలలెత్తుతారు, మైరావ ణాతలకాయల్లాగ.

క్రో:—అల్లాంటివారు తమరుసెలవిచ్చినట్టు అన్నిరంగాల్లోనూ పాతుకుపోయివున్నారు; ఈ ఇమిటేషన్ రాళ్ళని త్రొక్కి కంగా బాగా బడితపచ్చడిచేసినా పాపం అన్నముక్కే వుండదు.

డై:—'అనువాదమహాకవు' లుండగా అనుకరణభయంకరవర్యు కులకు కొదవేమిటీ? బైదిబై, మీ'Screen Script' సినేరియో ఎంతమట్టుకు వచ్చిందీ ?

క్రో:—పూర్తిఔతోంది 'కసరత్ రాణి' లేక 'ధామ్‌ధామ్.'

డై:—అరె 'రామ్‌రామ్!' ఎన్నాళ్ళకీ తెమలటం అంటూ కని పించడంలేదు. ఒక్క పుష్కరంపైగా తినేశావయ్యా! కవిజీ! అయినంతమట్టుక్కి ఏదీ ఇలా తగలెయ్యి!

క్రి:—(ఫైలు విప్పి 'ధాంధాం' స్క్రిప్టుచదువును.) చిత్తం! "అది ప్రశాంతసమయం, అపుడు హీరోయిన్..."

డై:—కవిగారూ! చిన్నకబురు! ఈ మాటు మీకలం వచన రచనలో అమృతం చిలకాలి! మీకలంపోటు గునపం పోటులా హృదయానికి హత్తుకుపోయే సంభాషణలను సృష్టించాలి! సరసకవితామాధుర్యం వుట్టిపడాలి! అదీ నా ఆశ!

క్రి:—(చేతులు నలుపుకొంటూ) ఏదో అలా అనాలని అంటున్నారుకాని ......

డై:—ఈమాటు కానివ్వండి.

క్రి:—దాని 'Continuity' - అది ప్రశాంతిసమయం! సాయంకాలం 5-30 గం॥లకు విజనప్రదేశం - కథానాయిక 'కసరత్ రాణీ' ఊరివెలుపల తోటలోకి ఏకాంతంగా గాలిషికారు వాలుమొగ్గలేసుకుంటూ వస్తుంది.

డై:—వహ్వా! Most Dramatic! గొప్పసన్నివేశం!

క్రి:—అంతా నిశ్శబ్దం! అప్పుడు కుడిచేతిప్రక్కనున్న పొద రింప్లు కదల్తాయి; 'Iron Hero' కథానాయకుడు

ఒక్క లాంగ్ జంపుతో ఎగిరిచక్కా వచ్చి, అమాంతంగా ఏమరుపాటుగావున్న 'కసరత్ రాణి' కళ్ళు రెండూ మూస్తాడు.

డై:—Packed with Romance! ఓహో! 'నాడియా స్టంటు'లు ఇకముందునుంచి పడుకోవలసిందే!

క్రా:—కసరత్ రాణీ ప్రక్కకుతిరిగి కుడిపెదవిలోంచి దేవికా రాణీ చిరునవ్వు' నవ్వి పైకి ప్రణయకోపంనటిస్తూ ఒర నున్నకత్తితీసి ఝళిపించి ఇట్లనును.

డై:—Thrilling fightings! కనులు మిరిమిట్లుగొలిపే కత్తియుద్ధం! ఇంగ్లీషుఫిలిముల తాతలా వుంటుంది! ఊఁ! చదవ్వయ్యా!

క్రా:—చిత్తం! సంభాషణ - మాటలు మొదలండి ...

డై:—('పై పు'లాగి) O. K; ఊఁ! చదవండి! గ్రంథం!

క్రా:—కసరత్ రాణి—కాసుకో! కసరత్ రాణీనుజానూన్ధుపు గాని! వొంటరిగావున్న 'అబల'పై చెయ్యివేస్తావ్!

డై:—ఓహో! పాతివ్రత్యం! భారతజాతీయమకుటం!

క్రా:—'Iron Hero!'—'ఐరన్ హీరో' యమదెబ్బతడాఖా, ఇనుపగుద్దు చవిచూద్దువుగాని! వీడుఅణాకానీ బ్రూట్ అనుకుంటున్నావుకాబోలు. కబడ్దార్!

డై:—అబ్బో! హాస్యరసప్రధానమైన సంభాషణలు! భేషుగ్గా వున్నాయ్! Push on!

క్రో:—ఓం ప్రథమంలో కత్తియుద్ధం, తర్వాత ముష్టియుద్ధం, ఆఖర్ని ముద్దులయుద్ధం... హోరాహోరీని జరుగుతాయ్...

డై:—'Wars of Roses' అన్నట్టు Wars of kisses! కేపిటల్! చాలా బాగుంది!

క్రో:—ముద్దుల యుద్ధానికిముందు వారిరువురి ప్రణయవాహినికీ మధ్య Dead-lock అడ్డు వస్తుంది!

డై:—అంటే?

క్రో:—అంటే వారిరువురి ప్రేమకి మధ్య 'చావు-కప్ప' అడ్డు వచ్చిందన్నమాట. అక్కడితో......

డై:—(ఉగ్రుడై) అక్కడితో కట్టిపెట్టండి తమరి Nonsensical nonsense! 'చావు-కప్ప'టచావుకప్ప ఏమిటి? నీనెత్తి తాళంనువ్వ్వాను. డేమిట్! ఈడియట్-ఈడియట్ అంటూను. పిచ్చికాకపోతే నీ తలకాయ నీకు కవిత్వం ఏమిటీ? స్టూడియోకవి ఏమిటి? (నెత్తి మొత్తుకొంటూ) ఓ! వాగ్గేయవిధ్వంసకా! మా 'అదృష్టం'కొలదీ వారి కావయ్యాౖ నాయనవ్! 'బుకింగ్'మాట ఏం చేశావ్! ఎవరో వచ్చారట చూడు!

క్రో:—చిత్తం ! తమరు వ్రాయమన్నట్టే-ఆ Instructions ని పట్టే వ్రాశానండి...

డై:—శుద్ధ 'Drainage' లావుంది నీ కవితాధార ! కవీ ! కవిగారూ !

(క్రొమ్మన......వస్తాడు.)

డై:—అవునుకానీ మధురానికి జానకిరామ్‌గారు చంకనెట్టుకొచ్చిన పెళ్లికొడుకుమాట-ఆ సమ్మంధం ఏమయిందో మీకేమైనా తెలుసునా ? అన్నట్టు-వారికీ మీకూ ఏదో బంధుత్వంకూడా వున్నట్టుంది.

క్రో:—చిత్తం ! మధురం నా మేనకోడలండి.

డై:—(బ్రహ్మానందంతో)అల్లాగటయ్యా! చంపేశారు! ఈకుర్చీనలంకరించండి ! ఇన్నాళ్లబట్టీ చెప్పేరుకాదే ? ఆవిడది కొంచెం మేనమామ పోలికకూడాను.

క్రో:—(కూర్చుని డైరెక్టర్ భావం గ్రహించనట్టు నటిస్తాడు, అమాయకంగా)

డై—జానకిరామ్‌గారు తెరించటానికి మనుమల్ని ఎత్తాలని సర్వ విధాల విశ్వప్రయత్నం చేస్తున్నారు నిష్ఫలం ఔతోంది. ఆమె ససేమి అంటోందిట.

క్రో:—అదేనండీ ! వచ్చిన గ్రహచారం ! మధురం 'పెళ్లొద్దు-వొద్దుకాక వద్దు' అని భీష్మించుకుని కూర్చుంటుంది.

'పెళ్ళయినా చెయ్యాలి, లేక చచ్చయినాపోవాలి' అంటూ మా జానకిరామ్ బావ శపథం పట్టాడు; పెళ్ళి ద్దరిమధ్య ఏమీ చెప్పలేక బంధుకోటంతా నలిగి చస్తున్నారు !

డై:—ఎదిగిన పిల్లకి పెళ్ళి చెయ్యకపోతే చాలా చిరకాటం వుందండీ.

ప్రొ:—'గుర్రంలా ఎదిగిందిపిల్ల ! పెళ్ళిచేశాడుకాదు ముస లాడు' అంటున్నారు లోకులు.

డై:—గొప్పచిక్కే వచ్చింది; పాపం ! జానకిరామ్ గారికి వృద్ధా ప్యంలో "పెళ్లేరియా" పట్టుకొని ప్రాణాలు కొరికే స్తోంది.

ప్రొ:—దర్శకులకి "ఫిల్మోరియా" !

డై:—చాలా సంతోషించాము కాని బుక్ చెయ్యవలసిన తారలసంగతి చూడండి-నేను రెడీలో వుంటాను.

ప్రొ:—చిత్తం !

డై:—కవిగారూ ! ప్రేమ్జీ, జులూ, మధురాలనీ స్టూడియోకి మాటలాడటానికి రమ్మని ఆహ్వానించాను; వస్తూవుంటాను; ఈవాళైనా చాలా రెగ్యులర్‌గా అనుకున్న సైనుకి అన్నీ సంసిద్ధంచేసుకొని చక్కని డిసిప్లిన్‌తో తదంగం నడిపించాలి; అన్నీ అరేంజి చేయించండి !

క్రొ:—చిత్తం! ఆర్కెష్ట్రాకి ఇవ్వవలసిన బకాయి ఇస్తేనేకాని Trial కి రామంటున్నారు; తమరు కాస్త......

డై:—ఆ! ఏడిశారు! ఇంతోటి ఆర్కెష్ట్రా దొరక్కపోదు. నే రమ్మన్నానని కబురుచెయ్యండి; వాళ్లే వస్తారు. ప్రొడ్యూసర్ ఊళ్ళో లేడని చెప్పితేసరి......

(క్రొమ్మన నడుస్తూవుండగా 'ప్రేమ్జీ' ఎదురువస్తాడు.)

క్రొ:—(దర్శకునితో) ప్రేమ్జీ వస్తున్నారండీ!

డై:—(కుర్చీలోంచి లేచి రిసీవ్ చేస్తూ) Hallo! ప్రేమ్జీ Quite welcomed! మీ రాకకై 'బుకింగ్' నిలుపు చేసి నిరీక్షిస్తున్నా! రండి! కూర్చోండి; ఒరే Boy! Boy!

క్రొ:—Boy ఇంకా రాలేదండి-వచ్చే వేళయింది.

డై:—అరెరే! కవిగారూ! Two drinks పంపించండి!

(క్రొమ్మన పంపిన డ్రింకులుపీల్చేసినతరువాయి.)

డై:—ప్రేమ్జీ! మా ఫిలిమ్‌ఫీల్డు, స్టూడియో జీవితం మీకు విచిత్రంగా వుంటాయి; ఒక్కొక్కప్పుడు ఇంత ఘాడాల మైనది ఇదేకాని వేరొకటి లేదు నరకం నయం అని పిస్తుంది.

ప్రే:—(భావయుక్తంగా) డైరెక్టర్లు తల్చుకుంటే ఎంతపని! నరకం, స్వర్గం ఇట్టే నిర్మిస్తారు, స్టూడియోల్లో—

డై:—మేము కృత్రిమనరకం చూపెడతామ్ !

ప్రే:—ఆ కృత్రిమమే నిజంలాగ చూపించడంలోనే వుంటుంది, ప్రతిభాప్రభావం !

డై:—కవిజీ ! బిగిన్ చేద్దామ్ !

క్రో:—చిత్తం ! ఇరుగోనండి దిగుతున్నారు! 'అభినవాంధ్ర, వర్ధమాననటీనట బృందం' !

డై:—ప్రేమ్జీ ! See & Enjoy !

ప్రే:—Thanks !

(దర్శకాగ్రణి విశ్వనాథ్, క్రొమ్మన, ప్రేమ్జీ ఉచితాసీనులై వుండగా ఒకస్టూడెంటు ప్రవేశం)

డై:—(సగర్వంగా, అట్టహాసంతో) మీరువచ్చినపనీ ! ఊ ! త్వరలో ! Quick !

స్టూ:—(సవినయంగా) నేను కొద్దిగా ఏక్టర్ని.........

డై:—పూర్తిగా కాదన్నమాట !

స్టూ:—ఫిలిమ్లో నటిద్దామని నాకు చాలరోజులబట్టి ఉద్దేశం ఉంది.........

క్రో:—సదుద్దేశం !

స్టూ:—అందుకై తమ.........

డై:—ఏమేమి పోర్షన్సు ఏక్టుచెయ్యగలరు ?

స్టూ:—తమరు ఏంచెయ్యమంటే అదిచేస్తాను; ఏమిచెప్పినాసరే తయార్ ! నాబొమ్మ తెరమీదికెక్కు తేచాలు ! వెండి తెరమీదికి...

క్రా:—చాలా ?

స్టూ:—అంతే ! అదే నాపరమావధి !

డై:—మహ'భేషుగ్గా'వుంది ! నేచెప్పినది నటించాలి, ఈముక్క లంటూ; "అబ్బా ! కారం! అబ్బా! దాహం !"అనాలి, హావభావాలు ముఖంలోవ్యక్తపరుస్తూ;ఊ! చెయ్యాలి! స్తంభాన్ని 'లవ్' చెయ్యాలి ! గాలితో కత్తిసాము చెయ్యాల్సొంటుంది. 'సినీమాలో నటిస్తాన్, నటిస్తాన్' అంటూ చంకలు ఎగరకొట్టడం అనుకున్నారుకాబోలు; సినీమా కళ అంటే సామాన్యమా ?

క్రా:—(ఉచ్చైస్స్వరంతో) అనన్యసామాన్యం !

డై:—ఇంద్రజాల మహేంద్రజాలాల్ని తలతన్నినవిద్య! తెల్సా?

క్రా:— తెల్సిందా ?

స్టూ:—చిత్తం ! 'అబ్బా ! ఖారం' ('అబ్బా! ఘోరం' అన్నట్టు ఉచ్ఛరించి విషాదాన్ని ముఖంలో చూపిస్తాడు).

డై:—నో గుడ్ ! నో గుడ్ !

క్రా:—భీభత్సం ! ఛండాలం !

స్టూ:—(దర్శకునుద్దేశించి) తమరు దర్శకులుగనక ఎల్లానటించాలో కొంచెం ప్రదర్శిస్తే, నేను మిమ్మల్ని అనుకరిస్తా.

క్రో:—మంచిపని చేస్తావ్ !

డై;—నాన్సెన్స్ ! డేమిట్ ! అదేమన్నమాట ? 'బుక్'
చేసేది నువ్వా, నేనా ?

క్రో:—శుద్ధ 'తారకాసురుడు' ల్లావున్నాడండీ !

డై:—ఈమాట Final test ! ఊ ! స్తంభాన్ని 'లవ్'
చెయ్యి !

ప్రేమ్జీ:—(ఆశ్చర్యపోయి) స్తంభాన్నా, ప్రేమించడం ?

డై:—ఆ ! ఔను! నిస్సందేహంగా ! స్తంభాన్ని 'లవ్' చెయ్యడ
మేమిటి, పిచ్చికాకపోతే అనొచ్చు, ఏప్రముఖులన్నా!
ఒకసన్ని వేశంలో Hero, Heroine ప్రేమించుకొనే
సమయంలో హీరో స్నేహితుడు స్తంభాన్ని ప్రేమి
స్తాడు ! దీనినే 'Commercial Shot' అంటార్ !

క్రో:—(విజయవంతంగా) డబ్బుగుంజే పద్ధతే ఇదీ !

ప్రే:—చిత్రంగావుందే !

డై:—వుంటుంది లెండి ... ... ...

క్రో:—చలనచిత్రంలో కదండీ ఈసన్ని వేశం !

ప్రే:—ఓహో ! అల్లాగటండీ ? బోధనాశక్తి మీకు ఎక్కు
వగా వున్నట్టు కనిపిస్తుంది. స్టూడియోకవిగారికంటె బడి
పంతులు అయివుంటే బాగావుండేది ... ... ...

క్రో:—తెగిన సలహా లేకపోవడంచే ఇల్లా ఐపోయాను.

స్టూ:—(వలపుచూపులు స్తంభముపై నిగిడ్చి) ఓ ! స్తంభ రాజమా ! నిన్నుచూసినవాళ్ళంతా స్తంభీభూతు లౌ తారు, నీ చక్కదనాన్ని చూడలేక; దూలమా! దూల రాజమా ! ఏమీ ! ఆ విశ్వకర్మ కళానైపుణి! కనులు మిరుమిట్లుగొల్పే అమరసౌందర్యం ! ఆ నగిషీలోని చిరునగవు! నీవు సాక్షాత్తు రంభవే! నలకూబరుని శాప మున ఇట్టి విపాదాకృతిని దాల్చితివి ! (డైరెక్టరు సమీ పంలో మోకరిల్లి) కట్టా! ఎంతకష్టమెంతకష్టము ! నీవు లేనిదే, నేను అచలుడనే ! స్తంభే ! భూలోకరంభే !

(తన బాహుపంజరమున డైరెక్టర్ స్తంభమును బంధించును )

క్రో:—(భావోన్మాదంలో) "భూ-స్తంభన! భూ-స్తంభన !"

ప్రే:—Excellent ! గొప్పగావుంది ! (చప్పట్లుకొట్టును)

డై:—సెభాష్ ! పనికొస్తావ్! నువ్వు నా సహాయదర్శకుడిగా వుంటువుగాని... ......

స్టూ:—చిత్తం !

ప్రే:—(స్టూడెంటుతో) చాలా బాగా నటించారండీ! Good Luck.

స్టూ:—ధన్యవాదాలు !

ప్రే:—డైరెక్టరుగారూ! నే సెలవు తీసుకొంటానండీ-ఎవరువచ్చి నా రాకపోయినా కార్యదర్శి మాత్రం క్లబ్ లో కుర్చీకి తాపటం ఐ ఉండాలి ! శెలవ్ !

డై:—మీకు చాలా శ్రమ ఇచ్చినట్టున్నాను.

ప్రే:—లేదండీ-శ్రమ ఏమిటీ, పవిత్రశమ చూడటంలో.

డై:—నేను కొంచెం బిజీగా వున్నాను...తర్వాత కల్సుకుంటా

[ప్రేమ్జీ నిష్క్రమి. తెర.]

---

తృతీయరంగము.

స్థ:—'అజంతా స్టూడియోస్'

[డైరెక్టరు విశ్వనాథ్, కవి క్రొమ్మన, ప్రవేశించి టీ పిల్చినట్టుగా పెదవి, చే-రుమాలుతో తుడుచుకుంటూ ఉచితాశీను లౌతారు స్టూడియో Paraphernalia అంతా వుంటుంది; ఫిలిమ్‌ఫీల్డుకి సంబాధించిన ఉద్గ్రంధాలు కళ్లు విప్పికొన్నీ, కళ్ళు మూసుకొని కొన్నీ యోగనిద్రావస్థలో, ఏపాఠకమహాశయుని హాస్తమన్నా శోకాలని చరితార్థతకొరకు తపస్సు చేస్తున్నట్టున్నాయి; నాల్గుకుర్చీలు, రెండు టేబిలు, సినీతారల చిత్రాలు, Ashtray, Gold-flake ఖాళీటిన్నులు; 'ఫిల్మిండియా' ప్రతుల దొంతర్లు ఇత్యాదులుంటాయ్!]

(శ్రీమతి 'రోజ్' సీతాకోకచిలుకలాగున టక్కుటమారులతో, టెన్నిసు రేకట్ త్రిప్పుతూ, ప్రవేశం)

క్రొ:—(చిరునవ్వుతో) ఈమె 'తార'లా అనుతోంది; 'శశాంకవర్యా'! చిత్తగించండి!

శో:— (మందహాసంతో) ఆ మాట్లాడేది వృద్ధబృహస్పతి గారేనా ?

డై:—Coming madam! ఒక్కక్షణం! కవిగారూ! తారలని సిద్ధంగావుండమని చెప్పండి! వెళ్ళండి!

క్రో:—చిత్రం! ఇప్పుడు 'షూటింగ్' వున్నట్టుంది... ... వుందాఅండి 'బుకింగ్' అయినతర్వాత ?

డై:—రేపు అంటుంటే!

[క్రోమ్మన నిష్క్రమణ.]

శో:—చాలా బిజీగా వున్నట్టున్నారు.

డై:—తారలను 'బుక్' చేస్తున్నాము; అందుచేత కొంచెం హడావిడిగావుంది.

శో:—తారలను 'బుక్' చేస్తే చేశారుకాని 'బైండు' మాత్రం చెయ్యకండి.

డై:—మరేమీపర్వాలేదు; చేసినా సర్దుకోగల తాహతు వుందిగా మనకి.

శో:—పోనీ, రేపు woodlands లో కలుసుకొందాము.

డై:—కూర్చోమంటూంటే ఏమిటా బెదరింపూ, రుసరుసాను; ప్రేక్షిామధురాల ప్రణయసాధానికి శంఖుస్థాపన ఐనట్టేనా ?

శో:—ఆ! అయినట్టే! కాని, మీ పంచదారమాత్ర కొంత వరకు పనిచేసినట్టు సూచనలు కనిపిస్తున్నాయ్!

డై:—బాబుగారు వెయ్యడం, పనిజరగకపోవడం కూడానా!
ప్రేమ్జీ మంచివాడని వూళ్ళో ప్రతీతి.

రో:—ఏమైతేనే! వాస్తవికుడు కాకపోయాక.

డై:—మధురం ఎన్నిగంటలకి వస్తానందీ? స్టూడియో చూడ టానికి?

రో:—అన్నట్టు, పరధ్యానంలో వుండి మర్చిపోయా! మధు...

డై:—పరధ్యానాలు ఎక్కువండీ మనుష్యులకీ! వుంటాయ్!

రో:—వుండనూవుంటాయ్! పదిమందిలో తిరిగేవాళ్ళకు.

డై:—పదిమంది'తో' తిరిగేవాళ్ళకా? రామరామ!

రో:—బాగానేవుంది గొడవ; లక్షణంగానేవుంది వ్యాపారం! 'పదిమందిలో-'లో' అంటే వినిపించదూ? పొగరు చెముడు!

డై:—కోప్పడకండి — డొంకతిరుగుడు వాటమేకాని అసలు విషయం తేల్చలేదు.

రో:—తెములుచ్చుకొనే పెద్దమనుష్యులైతేనా — వినండి మరి విషయం! మధురం ఒక్క పావుగంటలో ఇక్కడకు వస్తానంది; అదేటైముకి నేను స్టుడియోలో వైట్ చేస్తూ వుంటానని మాటఇచ్చాను; చెయ్యవలసినదేదో చేశాను!

డై:—Very many thanks! డార్లింగ్! రోజ్! మన ప్రయాణం ... పలాయనం మాట ఏంచేసినట్టు? దేవిగారి ఆజ్ఞకై.

రో:—వచ్చేవారం, 'బృందావన్ గార్డెన్సు'లో కలుసుకొంటా! మరినేను వెళ్ళాలి – ఇవ్వాళ చిన్న ఎంగేజ్ మెంటు వుంది.

డై:—ఈవారంలో, ఎంగేజ్ మెంట్లు ఎక్కువగా వున్నటున్నాయ్! మా 'బుకింగ్' వినోదం కొంచెం చూసి వెళ్ళుదురుగాని; ఆకుర్చీని ఒక్కపదినిమిషాలు అలంకరించండి!

రో:—చిత్తం! తారలని పిలిపించండి — టైము లేదు.

డై:—కవిగారూ! తారలకి కబురుచెయ్యండి!

(క్రొమ్మన ప్రవేశం.)

క్రొ:—చిత్తం! సిద్ధంగావున్నారు...

(ఒక గ్రాడ్యుయేటు-గుర్రపుకదనులా బూటుత్రొక్కుతూ, అట్టహాసంతో ప్రవేశం.)

రో:—ఇదుగో 'పంజాబ్ మెయిల్' వస్తోంది!

డై:—రావాలి! రానాలి! కాలయాపనై పోతూంది; మీరెవరు?

బి. ఏ:—నేనొక బి.ఏ-మనిషిని; కళోపాసిని-నేను రమేశాన్ని!

రో:—బి. ఏ-మనిషే? నిస్సందేహంగా?

డై:—త్వరలో తెమల్చాలి !

బి. ఏ:—బాగా జ్ఞాపకం లేదు కాబోలు తమరికి; మీరు "బుర్ర లేనిమనిషి"లో హీరోగా నటించినప్పుడు, నేనొక హాస్య గాడిలా నటించా !

రో:—నిజమేనండీ 'బుర్ర లేనిమనిషి హీరో'గారూ ?

డై:—బాగానేవుంది డబ్బావాయిద్యం !

క్రో:—బఫూన్ కి గాత్రపాటకి లోటేమిటండీ !

డై:—రింగ్ మాష్టర్ ! ఏమైనా ప్రస్తుతం Extempore గా నటించాలి ! కవిగారూ ! ఈయన 'delivery' ఎల్లా వుంటుందో చూడండి !

బి. ఏ:—అదంతా మన మంత్రసానితనంలో, అంటే 'Mid-wife గిరీ'లో వుంటుందండి.

డై:—(రోషంతో) దొంగనొప్పులయితే ఏమంత్రసానితనం మాత్రం ఎందుకు పనికొస్తుంది !

రో:—(స్టూడెంటునుద్దేశించి) మీరు ఎప్పుడైనా మేల్ నర్సా?

డై:—సంతోషించాము కాని, తమరు ఏదైనా పదివంక్తులు గణగణా చదవండి !

క్రో:—చదివించండి !

బి. ఏ:—నేను 'Sorrowful roles' అందులోనూ క్రోధం, విషాదం నటించగలను ! 'Othello' నాటకంలో

విలన్ 'ఇయాగో' పాత్ర ఒకప్పుడు చాలా జనరంజకంగా నటించి నిర్వహించా! Hamlet లోని స్వగతాలు - ఇంకా Mono-acting కూడా చెయ్యగలను; మచ్చుకొకటి - Antony's Funeral Oration 'Friends! Romans! Countrymen!' (బ్రహ్మాండం బ్రద్దలయ్యేటట్టు బొబ్బరిస్తాడు.)

డై:—వద్దండీ! నో ప్లీజ్! తుప్పుపట్టిపోయిన పాతపురాణం విప్పకయ్యా!

క్రా:—ఏక్కడో గద్దురకం 'రక్తగ్రహణి' లా పట్టుకున్నాడండీ!

బి. ఏ:—(ఒక్కగుక్కని, ఆగమన్నా ఆగకుండా) "To be or not to be" - in the studios! "That is the question!" To act or not to act! "Whether it is nobler in the mind to suffer the slings & arrows out rageous", heinous mal- treatment that is being administered to : the now-a-day-stars - or to purge them out manfully!

డై:—(రుద్రుడై) ఓ! మిస్టర్ 'Not to be' మాట్లాడవలసిన దదికాదు. మిస్టర్, 'ఇయాగో!' మేము తీయబోయేది తెలుగుచిత్రం!

క్రా:—దయచేసి తెలుగులో ఏదైనా ... ...

బి. ఏ:—ఐతే, పౌరాణికపక్కీలో! (దర్శకుని తదేకదీక్షగా చూస్తూ, అడుగువేస్తూ పాట పాడును.)

గానము:- ఖండనమునన్, ఉద్దవిడిన్ - చంపెద, పొడిచెద, నరికెదన్ భడవా!

టరడఢా! తథదధా! తులువా!

ఖండఖండలుగ, వ్రయ్యవ్రయ్యలుగ దునిమెదన్! కాల్వా!

మదాంధా - శాల్వా, హాల్వా! హావా!

(కోపోద్రిక్తుడై, ప్రళయహంగామాతో) ఓరీ! మహాఘోగ్రపాతకా! కృతాంతహంతకా! మదాంధా! కండ్లు కానరావా? ఛీ! ఛండాలా! కండకావరము చే మీదుమిక్కిలి పెచ్చుపెరిగి ఏడ్చుచుంటివి; చూడుము! నిన్నేమిచేయుదునో! నిన్ను ఖండఖండలుగ వ్రయ్యలుగ దునిమి, నీ తనువెల్ల తుత్తినియలగునట్లు (చేతితో కలంతీసి) ఒక్క వ్రేటున చించి, చెండాడి యమసదనమున కతిథిగా పంపెదగాక! (రివ్వున దర్శకునివైపు పరిగిడి, అడుగువేయుచు) దురాత్మా! దుర్మతీ! దుందుభీ! రక్తాక్షీ! క్రోదాక్షీ! అక్షయా! చచ్చితివా! (అని వొళ్లుతెలిసిన ఆవేశంలో దర్శకమహాశయుని పీకని, అమాంతంగా పైబడి నులుమును.)

డై:—(పీక విడిపించుకొనే ప్రయత్నంలో) "క-పీ! క-పీ! హె-ల్ప! హె-ల్ !"

రో:—ఇదేమిటీ ? ఈ అన్యాయం ! వీడికి ఒంట్లో ఆరోగ్యంగా లేదు ! ఆ ఘటాన్ని శుద్ధిచెయ్యండి - కవిజీ !

(బ్రహ్మాండంమీాద కవి, ఆతని విడిపించి, శుద్ధి చేయును)

బి. ఏ:—అబ్బా ! దాహం !

డై :—ఓరి ! క్రేక్ ! పిచ్చిఘుండా వాడిలా వున్నాడు; ఇవ్వండి ! సోడా ఇవ్వండి ! కొంపతీసి స్టూడియోలో ఆవలించాడంటే మనం అంతా చావాలి చచ్చేవాడిత్రోటి; వీడి దుంపతెగా ! చూస్తూండగా వచ్చివచ్చి నామీాదే పడ్డాడే ! వీడి 'ఇయాగో' విలనీ అంతా మనమీాదా ప్రయోగించడం ? కవీ ! వీడ్ని బరబరా ఈడ్చుకెళ్లి "సినీమా పిచ్చాస్పత్రి"లో పారెయ్యి ! (Cini-lunatic Assylum)

క్రౌ:—చిత్రం ! ధారావైద్యం చేయించి సినీమాపిచ్చి వదలకొట్టే డైరెక్టర్ శాంతారామ్ పిల్సు తగిలిపిస్తాసండి (మన తారని స్టుడియో రూమ్‌లో పెట్టి తాళంవేస్తారు; N. B. Director Santharam's pills :-Supreme specific for cine-lunacy.)

రో:—Very sorry ! డైరెక్టర్ ! లేచిన వేళావిశేషం అనుకుంటా ! మధురం వచ్చేవేళయింది; అసనుయాటకి నేను దాటువెయ్యాలి ! శెలవ్ ! (రోజ్ నిష్క్ర.)

డై:—కవిగారూ ! ఏంచేస్తున్నారు? 'Boy'ని గరమ్ గరమ్ 'ఛా' తెమ్మనండి !

క్రో:—చిత్తం! గొంతుక ఎండుతుందండి (బాయ్ టీ తెచ్చును)

డై:—కవిగారూ ! సేపు కనిపించండి !

క్రో:—ఇంకేమీ తరువాయిలేదండి ? ఇంకా వున్నారు కా జోయే సినిమాతారలు.

డై:—ఇంకానా ! అదేమి పాపకర్మమోగాని ఈవేళంతా ఇల్లాంటి 'భస్మాసురఘటాలే' దాపరించారు ! వాళ్లని పొమ్మని, మీరుకూడా శెలవుతీసుకోండి - విశ్రాంతి తీసుకోవాలి.

(క్రోమ్మన నిష్క్ర)

(డైరెక్టర్ పై సర్దుకొని, కోటుధరించి, సిగరెట్టు వెలిగించి, లేనిసంతోషం తెచ్చుకొని ప్రయోగింపనున్న కీచకాధమ తంత్రానికి ఉద్యుక్తుడై వుండగా, శ్రీమతి మధురంప్రవేశం)

మ:—డైరక్టర్ గారూ !

డై:—(స అట్టహాసంతో ఓసీవుచేస్తూ) హల్లో! మధురం టేక్ యువర్ సీట్ ! దయచెయ్యండి.

మ:—'బుకింగ్' మహోత్సవం ఐపోయిందా ? ఏరీ తారలు, కవి, ఆర్కెస్ట్రా ?

డై:—రిసెస్‌లో కాఫీకి వెళ్లారు. కొంతముగిసింది. ఇంకాతరువాయి 'బుక్' చెయ్యవలసిన వాళ్ళున్నారు మీరు ఆలస్యంగా వచ్చారు.

మ:—అమృతం విషం అయిందా ఏమిటి ? రోజ్ ఏదీ ? ఇక్కడికిరాలే...'వస్తాను, తప్పక wait చేస్తూవుంటా'నని వాగ్దానం చేసిందే ?

డై:—వచ్చి, ఇప్పటిదాకావుండి వెళ్ళింది; 'ఒక్కపదినిమిషాల్లో వస్తాను ఈలోపుగా మధురం కనకవస్తే Boy చేతకబురు చెయ్యండి' అంది.

మ:—నమ్మించి మోసగించిందే ! 'గ్రేడ్' తినిపించాలనా ?

డై:—అరే ! Boy ! మధురంగారు వచ్చారని రోజా అమ్మగారిని పిలు !

(Boy వచ్చి వెడలును)

డై:—మీలాంటి విద్యావతులు ఫిలిమ్‌ఫీల్డులో ప్రవేశించి,కళారాధకులై ఎక్కువశ్రద్ధతీసుకొంటేనేగాని, ఆంధ్రాఫిలిం పరిశ్రమ అభివృద్ధిలోకి రాదు !

మ:—మీరంతా వున్నారుగా ! కళని ఉద్ధరించటానికి, ఉన్న వాళ్లు చాలరూ ?

డై:—అదేమన్నమాట ! పెద్దచదువులు చదివిన శశికళలంతా నన్ను ముట్టుకోకు నామాలికాకి అని Touch-me-

not అంటే 'కళ' ఏమాతుందీ? పోంస్లెండి, స్టూడియో లైఫ్ చూద్దామనేనా వచ్చారు; ఆమాత్రం దయ వుంచారు !

మ:—ఎంతమాటా ? లేకపోవడమేమిటి !

డై:—ఈరోజుల్లో స్నేహధర్మం నిలబెట్టేవాళ్లు చాలాతక్కువ.

మ:—ఔను ! గౌరువం నిలబెట్టుకొనేవాళ్లూ తక్కువే...

డై:—మధూ ! చాలరోజులఁబట్టి నిన్నొకటి అడగాలను కొంటున్నా !

మ:—ఏమిటీ ? నన్నా ?

డై:—ఆ ! నిన్నే ! నిన్ను తారాపథంలో ప్రప్రథమస్థానం అలంకరించేటట్టుచేసి, Hollywood తారల తలతన్నే టట్టుచేస్తా ! Star-value—reply paid wires మీద రప్పించేస్తా ! 'ఫ్రూమ్‌ఫ్‌గరల్' ఐపోతావ్ !

మ:—(రోషగర్భితంగా) ఏమిటీవింతధోరణి? ఈ wolf వాటం.

డై:—(ఎక్స్‌ప్రెస్‌స్పీడ్‌లో) కాని...మధూ ! నీవల్ల నా ఆశ ఫలించాలి! నిన్నొక్క టి యాచిస్తున్నా ! నీ స్నేహపా త్రుడవవాలనివుంది...నీచెలిమి నాక్కావాలి ! ఈప్రప పంచంలో నా అన్నవాళ్ళెవ్వరూనాకు లేరు; నీహృదయ సీమలో కాస్తచోటివ్వాలి ! ఇస్తేనేకాని నాపవిత్రప్రే మకు సుభిక్షం లభించదు! నిరాశామరుభూమిలో...

నన్ను దహనం చెయ్యకు! స్త్రీహృదయం నవనీతం. పునీతం...

మ:—(హేయంగా) హాలాహలంకూడాను.

డై:—(మాట చొరనివ్వకుండా, ఆమె సమీపంలో మోకరిల్లి మోమువైపు చేతులుచాచి) 'మై సాగర్ హూమ్! తుమ్ సరితా!' నే-సాగరుడ! నీవు సరిత!

మ:—(కోపాధిక్యంలో) నువ్వు సాగరుడవైతే నే తుపాన్!

డై:—(అదే Pose లో) ఓ! మేరీదేవతా! నాహృదయాధిదేవతా! నన్నుతరింపచెయ్యి!

మ:—(విజృంభించి) నిన్ను తన్నింపచేస్తా! ఏయ్! పశువా! బుద్ధిలే? కట్టిపెట్టు! వాళ్ళుతెలియని పేలాపనపేలుతున్నావ్! ఇదేనా స్టూడియోజీవితం? ఓరి! 'స్కాండ్రల్'! నీదర్శకత్వంమండా! You characterless rake! Muckrake! నీ హృదయాధిదేవతను కాను! నీ ప్రేమ అఖాతాన్ని, సగ్గోలుపరచి, అల్లకల్లోలంచేసే నీ"హృదయాంతర్గామిని"ని! తెల్సా? డబ్బున్న గాడిదకొడుకులు, ఒకటి రెండు ఫిల్ములు తీయించి, డైరెక్టరని అచ్చేసి వదిలేశారు. మార్కెట్లో, శుద్ధనైతికశూన్యంఐపోయింది, వెధవఫీల్డు! పైగా 'Ace-Director'ట! you! ass of a director!

ఫిలిమ్‌ఫీల్డు అంటే పశువాంఛలకి ఆటపట్టు, నంతా అనుకొన్నావా ? నైతికహంతకా ! నిన్ను ... ... ...

డై:—క్షమించు ! మధురం !

మ:—నిన్ను వీధిలోపెడతా ! పేపర్లో ప్రకటించి టామ్‌టామ్ చేయిస్తా !

డై—నా నోట్లో దుమ్ముకొట్టకు! నువ్వలా చేసినరోజున నాకు ఆత్మహత్యకంటే వేరే గత్యంతరం వుండదు.

మ:—ఒక్క ఏలినాటిశని పిరగక్రైపోతుంది ! నీలాంటిదర్శకవృషభులకి అరణ్యమేశరణ్యం! నువ్వు ఈఫిలిమ్‌ఫీల్డులోంచి విరమిస్తానని వాగ్దానంచెయ్యి! వ్రాతమూలంగా ఇయ్యి! ఇంకా ఎంతమంది శీలవతులశీలాన్ని మంటపాలు చెయ్యదల్చుకొన్నావో! ఇంతటితో ఐపోలేదు! Director Dunder-head అని నీమీదకటాపికల్ తీయించి విడుదలచేయిస్తా ! దగుర్భాజీ ! అప్రాచీ ! పాజీ ! (ఆవేశంలో స్వమానరక్షణోపాయంలో మధురం డైరక్టరును ఒక్కలెంపకాయ కొట్టును. అదే సమయాన్ని జలూ ప్రవేశం.)

డై:—(ప్రేటుతిన్నపులి ఐపోయి) ఆ ! ఆ ! మధురం ! నిన్ను వదల ...

జు:—(సకిలించి) 'Shooting' కాదుకదా ! మధురంగారు లెంపకాయలనోము పట్టినట్టున్నారు......ఏం ! డైరెక్టర్ మానవా ! ఆ గరమ్‌గరమ్ పెసరట్టుతో బుద్ధి వొచ్చిందా? ఇంకా ఏమైనా తరువాయితీర్చాలా? సంసార్లని ఫిలింలోదింపి కాపరాలు నిప్పుపెట్టడమేనా, నీ ఆదర్శం ? "అంతర్జాతీయ- హంతకా !" పొడుచుకొని చావకూడదూ ? వెధవ చావు-బ్రతుకు బ్రతికేదాని కంటె ! ఏయ్ ఘరాణాదొంగా ! డొక్కవాలికలు చేయించేస్తా ! ఇంక వెర్రివెర్రి అవతారాలు చాలించవోయ్ 'బడుద్ధాయి భాగవతార్!' చేతిలో Hunter వుంది ! "Hunter' పత్రికవుంది ! స్వ సంపాదకీయం జాగ్రత్త !

మ:—(విప్పివున్న డైరెక్టరుయొక్క తారల 'ఆల్బమ్' లో, తన ముఖచిత్రాన్ని గుర్తించి, నివ్వెరపాటుచెంది, కోపోద్రిక్తయై) ఈఫోటోఎక్కడిది?......ద్రోహీ !

జు:—(డైరెక్టర్‌ఫోటోను భద్రంచేయునెంచుచు గ్రహించి) ఒకరిచ్చేదేమిటే! నీచాతినీచమైన కుతంత్రాలుపన్ని పవిత్రాశయాలను భగ్నంచేసే భగ్నమారీచాధములకి! నడు ! నడు ! ఒక్కక్షణం నిల్చుటకైనా అర్హతలేని స్థలం! (నిష్క్రమిస్తూ డైరెక్టర్‌వైపు తీక్షణంగా చూస్తూ) 'ఇయాగో–సంతతి !'

(జులూ, మధురముల నిష్క్రమణ)

డై :—(వికటంగా, విషపునవ్వు వినీ వుట్టిపడేటట్లు ప్రకటించి తాపీగా అక్షతలు దులుపుకుని ధైర్యంగా లేచి) ఓహో! కాలమహిమ ! నిన్నమొన్నటివరకూ అద్దె సైకెళ్ళు లాగ తిరిగే ఘటాలు, నేడు పతివ్రతలైపోయారు ! ...పాచిక పారిందికాదు — సైంధవలడ్డూలా 'జులూ' గా డొచ్చిపడ్డాను, నాప్రాణానికి; For instance ఇలాంటివి ఒకటి రెండైతేనేగాని ఘనాపాటీ డైరెక్టర్ అవకు-డేమిటఁ ! కధ అడ్డంతిరిగిందే, చూస్తూండగా ! ఇంకా, తమిళ హిందీ చిత్రాలున్నాయిగా డైరెక్టు చెయ్యడానికి ... (విజయవంతంగా జేబులోంచి 'వైరు' తీసి) అన్నట్టు - ఇదిగో ! మలబారునుంచి 'చతుర్ముఖం ముదలియార్' తమిళచిత్రం డైరెక్టుచెయ్యమని బాబుగారికి-పంపిన ఆహ్వానం — శుభలేక ! ... ... ... Poor soul! డైరెక్టర్ కళ్వం! నిరుత్సాహపడకోయ్! 'Almighty Villains of Shakespeare' అనే, సబ్జెక్టుమీద అమోఘమైన 'రిసెర్చి' సాగించి Extempore గా లెక్చర్కుకొట్టె తాహతుగల ముండా వాడికి, నీకే ఠికాణా లేకపోయిందంటే నీకుకాదు ఆ అగౌరవం—ఆదేముని సృష్టికే! A fair trial is never a loss! O. K. రోజ్ ! వచ్చేవారం బృందావనగార్డెన్సులో నా మన Honey moon ! గుడ్ బై ! [డైరె॥ నిష్క్ర-తెర]

# ప్రణయసామ్రాట్.



## పంచమాంకము.

### ప్రథమరంగము.

[స్థలం:—మధురం స్వగృహం; శ్రీమతి మధురం 'భ్రమరీ! భ్రమరీ। అని Hum చేస్తూ ప్రవేశించి, రౌండుటేబిల్ వద్దనున్న కుర్చీలో కూర్చుని 'లెటర్ పేడ్' కలం తీసి పెదవిక్రింద నొక్కుతూ ఆలోచనా నిమగ్నయై 'Dear ప్రేమ్జీ' అని వ్రాసి, 'స్వేచ్ఛాప్రణయం' అని ప్రియుని తలచుకొన్నట్టుగా సంబరపడును.]

గానము.

భ్రమరీ ! భ్రమరీ ! భ్రమరీ !
ఆని ఆసనీ, పుష్పాసవమే
గ్రోలి గ్రోలకా, ఆరాటము లేలా ! భ్ర॥
మండు ఎదలోని జవ్వనపు వాంఛలా
పోడిమల్ బాప సమకట్ట నేలా ! భ్ర॥

(పాటానంతరము కుర్చీలోంచి చటుక్కున లేస్తూండగా, తండ్రి జానకిరామ్ శూన్యవదనంతో ప్రవేశం !)

జా:—మధురం ! ఏంచేస్తున్నావమ్మా ?

మ:—ఏం నాన్నా, పిలిచారు ?

జా:—(ఆసీనుడై ఆతృతతో) నీతో ఒక్కముక్క చెప్పాలని... ఇది నా అంతిమకోరిక ! చెప్పనా, మానా అని తట బటాయిస్తూన్నా; చెబుతేనేను వ్వెక్కడ నొచ్చుకుంటావో-నిన్ను బాధిస్తే-నేను ఆత్మహత్య చేసుకొన్నట్టుగా ఆ మరణవేదన నంతా ఆమరణాంతం అనుభవించాల్సొంటుంది ! అయినా నా విద్యుక్త ధర్మం గనక...

మ:—మరేం పరవాలేదు ; నాన్నా ! చెప్పు—చెప్పవూ ?

జా:—అమ్మాయ్ ! నాకు ఏభయ్యోయ్యపడివచ్చింది ! 'One foot in the grave' అన్నట్టుగా, కాటికి కాళ్లుచాచుకొని సిద్ధంగావున్నా ! ఈ చరమదశలో 'నా' అన్న వాళ్ళంతా, బంధుకోటి అంతా కట్టుకట్టి నన్నొక మాలగా, కాదు, ఒకహంతకునిగా భావించి, మసిపూసినవ్వులు నవ్వి, ఇహిలించి నల్గురిలోనూ తల మెత్తుకోకుండా చేస్తున్నారు !

మ:—నాన్నా ! లోకం గ్రుడ్డిది ! వ్యక్తుల మంచిచెడ్డలను గుర్తించలేదు ! శిక్షచెయ్యకూడదు !

జా:—మాయాలోకం ! పాడుసమాజం ! ఇన్నివేల ప్రజ పశుబలం అంతా ఒక్కముదుసలిపై ఈనిర్భాగ్యునిపైకదా కత్తికడుతోంది; జలగల్లా నానెత్తురు పీల్చేస్తున్నారు ! సమాజంకాదు ! 'సమజం'—పశువులసమూహం !

మ:—ఎందుకు నాన్నా! మిమ్మల్ని వేధించుకొని తినడం? సమా జం ఆక్షేప బుఱ్ఱాడించుకుంటూ మీదికివచ్చిందంటే డొక్కచీరేస్తామ్ ! మన్నేంచేస్తారు నాన్నా ?

జా:—అదికాదమ్మా ! అదికాదు. పసికూనవు...నీకేం చెప్పినా ప్రస్తుతంలో తెలియదు. నాగ్రహచారం కాకపోతే ఒక్కగాన'ఒక్క పిల్లవు—ముద్దూముచ్చటగా ఆమూడు ముళ్ళూకనక పడితే, నన్ను స్వర్గధామానికి చేర్చినదాన వౌతావు ! నాకూ మనుమల్ని ఎత్తాలనీ, ఆచిట్టిగాడిని చంక నెత్తుకొని ఆడించాలనీ—ఆ చిట్టిగాడి చేతుల్లోనైనా వెళ్ళిపోతే నాజన్మతరిస్తుందనీ—ఆశ !

మ:—నాన్నా ! నాన్నా ! ఏమిటి మీఅధైర్యం ......

జా:—హృదయం, పితృవాత్సల్యం, ఔదార్యంగలదానవు; విద్యావతివి నాపరిస్థితి—నాగ్రహస్థితి కొంచెం కటాక్ష కిరణాలతో చూస్తే గ్రాహ్యం ఔతుంది! ఇంతకన్న ఏం చెప్పనమ్మా ! నీభావిజీవితాన్ని ఒక్కమారు తలచు కుంటే కడుపుతరుక్కుపోతోంది !

మ:—(కలతమనస్సుతో) నాన్నా ! నాన్నా ! .........

జా:—ఎదిగినపిల్లా, పాములబుట్టా ఒకటన్నారు పెద్దలు ! అది యుగయుగాలకీ అనంతసత్యమే ! పాములబుట్టకి గాలి

కొద్దిగా శోకు తేనే బుట్ట బుట్టలావుండేది; ఎదిగినపిల్లకి వయస్సువచ్చినపిల్లకి ఎక్కువగాసూర్యరశ్మి—గాలిశోక కూడదు; నవకం చెడిపోతుందమ్మా !

మ:—ఏమిటీ ? సమాజంలో స్వేచ్ఛగా మసిలినంతమాత్రా న్నా ? ఎవరైనా ..........

జా:—ఆ ! గృహలక్ష్మి ఐ, గృహాభ్యంతర సీమలలో హంస వలె నడయాడవలసినదే కాని, యధేచ్ఛగా తిరుగుతే ఎల్లాగమ్మా ? ఆ 'రోజ్'ని గురించిచూడు ! వూళ్ళో పుకారు ఎల్లాపుట్టిందో ! గాలిదుమారంలా ఊరినంతనీ గగ్గోలు పరచేస్తోంది; పెద్దతలకాయలు దగ్గరనుంచి, బొడ్డువూడని 'నెలతక్కువ-కుంకల'కుకూడా ఒక లేపాట ఐపోయింది! ఆ బుద్ధిమంతుడు, యోగ్యుడు 'ప్రేమ్జీ'ని ఒరే ! వీడు 'ప్రేమభిషక్'రా ! 'డాక్టర్ ఆఫ్‌ప్రేమ్'; 'డి.పి'గాడురా!" అంటూ తరుముకూతలు కూస్తున్నారు ఆగతాయిపిల్లలు. దీనికంతకీ కారణం !

మ:—(ఆతృతతో) ఏమిటి నాన్నా? ఏమిటి ?

జా:—'రోజ్' నవయువతి; స్త్రీ తన సహజముగ్ధత్వాన్ని — సౌశీల్యాన్ని ఏకాశీలోనో, గంగలోనో వొదిలేసి — స్వేచ్ఛగా కుడీ ఎడమా లేకుండా బరితెగించిపోవడం వల్ల, అటుమూడు, ఇటుమూడు తరాలవాళ్ళ వంశమ

ర్యాదలకే తనస్వహస్తాలతో నీళ్ళువదిలింది రోజ్ ! ఔ
పోసన పట్టిన డైరక్టర్ విశ్వనాధ్ స్టూడియోలను ఉద్ధ
రిస్తున్నాడు ! వాడికేం ? ఆ'రోజ్' తండ్రి యమయాత
నపడుతున్నాడు ! ఆమె ఎవరనుకొన్నావ్ !

మ:—(తెల్లబోయిచూస్తూ) ఎవరు నాన్నా ! ఎవరూ రోజ్?

జా:—'సరోజ' అని నీచిన్నతనంలో బాల్యస్నేహితురాలై— మీరంతా పిచికగూళ్లుకట్టి-దూముంపుల్ల ఆడుకొన్నా రే—ఆ'సరోజ' 'రోజ్!' జగన్మోహనరావుగారి ద్వితీయ పుత్రిక ! కాదూ ! ఆయన మృత్యువు

మ:—(విభ్రాంతమై) అల్లాగానాన్నా ! సరోజా !

జా:—ఔనమ్మా ! ఔను ! ఇవ్వాళ 'సరోజ' రేపు...(మధు రం అన్నట్టు సూచింపును).

మ:—ఏమిటి నాన్నా! అంటున్నారు! అల్లా ఎన్నటికీ జరుగదు! జరుగ నేరదు !

జా:—జరుగదు—ఎందుకు జరుగనిస్తావ్ ! నాగౌరవం, పెద్ద తనం, రోంతా ప్రజాదృష్టిలో 'పరశురామప్రీతి' ఐపో తేనేగాని......'రాతులా ఎదిగింది పిల్ల ముసలాడు పెళ్ళిచెయ్యకుండా అట్టేపెట్టాడు; అంటోంది-అదుగో ! ఆగ్రుడ్డిమూలోకం ! వింటున్నావా ? సహస్రమృత్యుగ హ్వరాల్లా, మారణయంత్రాల్లా - ఆవోళ్లుచూడు !

తెరచుకొని గ్రుడ్లురుముతూ కబళించేటట్టు బెదరిస్తోంది!
అబ్బా! కాఠిన్యం! పాషాణాతికర్కశహృదయుం —
ఆ లోకానిది! అవమానానలంలో, ఆకార్చిచ్చులో పురి
కేదానికంటె చస్తేమేలు; ఇంతకీ నీకు పెళ్లొద్దు అనేబుద్ధి
ఎందుకు పుట్టాలి? నా ప్రాణాంతకానికే వచ్చింది...

మ:—స్త్రీకి పెళ్ళయితేనేకాని జీవితసార్థకత లేదా? కన్యాత్వం, నీచం, హేయం, అని శాస్త్రాల్లో ఉందా? మానవ నిర్మితసంకుచితశృంఖలాబద్ధశాస్త్రాలు! నిబంధనలు!

జా:—ఎల్లాపుట్టిందో,ఆడపిల్ల-అల్లాకన్యలావుండిపోవడం అనేది "దిశమెడ"తోటి మంగళసూత్రం లేకుండా మనహైంద వసాంప్రదాయంకాదు! భారతజాతీయ ధర్మవిరుద్ధం! ఘోరం! మనదికర్మభూమి! ధర్మపీఠులు భారతీయు లని వేనోళ్ళ చాటుతున్నారు, పాశ్చాత్యులు! అల్లాంటి భారతదేశాన జన్మించి, భారతరమణివై పెళ్ళీ పెడాకు లూం లేకుండా, సన్యశించటానికి ఇది రుద్రభూమికాదు! రుద్రభూమికాదు! అయ్యో కాళిదాస్! భవభూతులు! వారి ఆత్మలు! నిన్నుచూసి ముక్కుమీద వేలువేసు కుంటున్నాయ్! స్త్రీజన్మమాతృత్వాన్ని సార్థకతపొందు తుందని చతుర్వేదాలు, ఉపనిషత్తులూ ఘోషిస్తు న్నాయి! కనుక అమ్మాయ్! పెళ్ళాడి నన్నుబ్రతికించు!

లేకపోతే నైరాశ్యంలోపడి కృశించి నశిస్తా ! (మధు గడ్డంపట్టుకొని బ్రతిమాలును)

మ:—(కరగినహృదితో, రుద్ధకంఠంతో) అంతటిఘోరానికి ఒడి కట్టకు నాన్నా! నువ్వుతప్ప నాకుమాత్రం ఎవరున్నారు! క్షమించు! పెళ్ళయితే ఈస్వేచ్ఛా స్వాతంత్రం వుండవనే వుద్దేశ్యంతో,ఆభర్తగారి నిరంకుశత్వానికి గురికాలేక...

జా:—(ద్విగుణీకృత బాధాకలుషితావేశంతో)అదివట్టి అపోహ! శుద్ధకల్ల ! పెళ్ళయితే, స్వేచ్ఛా, స్వాతంత్రం వుండవని ఎక్కడవుంది ? కేవలం వాదప్రతివాదాలకోసం, బల్ల గుద్దిచెప్పే ఉపన్యాస శిరోమణుల 'బల్లవాక్కు' కాని వేదవాక్కు కాదు !

మ:—మొగాడికి వున్నంతస్వేచ్ఛ స్త్రీకి వుండితీరాలి ! లేక పోతే దాస్యం.........

జా:—స్త్రీకి తనఇంట్లో సర్వస్వాతంత్రం వుంటుంది! స్త్రీ సంసారానికి అంగభూత! ఇల్లనే సామ్రాజ్యానికి పట్టమహిషి-స్త్రీ! భర్తని దైవంగాఎంచి ఆతని అభిరుచుల గ్రహించి అనువర్తనగా వర్తించే సాధ్వికి, భర్త నిరంకుశుడు,నియంతా ఎల్లాఅవుతాడు ? భార్యాలోలుడౌతాడు; పరస్పర అవ్యాజ ప్రేమానుబంధం వారిద్దరినీ ఏకమూర్తులుగా నొనర్చినప్పుడు, భేదాభిప్రాయాలకు నిర్బంధా

లకు తావు లేదు. ఎండమావులనుండి విశుద్ధజలం త్రాగ గలరు. (మధునుద్దేశించి) మధుకీలల నుండి జీవితమధువును గ్రోలగలరు ! మధురం! ఆ స్వర్గతుల్యమైన సంసారసౌఖ్యాన్ని అనుభవించి, హాయిగా సుఖస్వప్నాల ఆనందసింధువులో తేలియాడేభాగ్యం నీకుపట్టడమే— చూడాలనివుంది. (మానసికంగా ఊహించి భ్రాంతిలో) ఆ పెళ్ళిపీటలు! వధూవరులు! మంగళతూర్యనాదములు!

మ:—(కన్నీరుడించుచు, తలవంచి) నాన్నా! నాన్నా ! జ్ఞానోదయం అయింది ! నిన్నింత బాధించినందుకు నన్ను క్షమించు ! నీబిడ్డను—నీ ఇష్టం!

(జానకిరామ్ తలవంచుకొని నిష్క్రమించును; ఆవేడిలో 'మధు' ప్రేమ్జీకి ఉత్తరం వ్రాయును )

ప్రేమ్జీ ! తమరు ఈలెటరు అందినతక్షణం నన్నుకలుసుకోవల్సినది. మీరు రానిచో— ఈ అభాగిని... ఆత్మహత్య !

మీ-మధూ.

(లెటర్ మడతపెట్టి కవరులోపొందికగా అమర్చుతూ స్వీయ భావిజీవితగతిని అతితీవ్రంగా ఆలోచిస్తూ తదనుగుణ్యంగా పాటపాడును. తనలో అనుకొంటు ఆవేదనా కలిత హృదయం వెలిపుచ్చుతుంది)

మ:—ఇక ప్రేమ్జీకి చేరేమార్గం ?

(శ్రీ 'జులు' ప్రవేశించి, పరిస్థితి గ్రహించి సమయస్ఫూర్తిగా)

జు:—సన్మార్గంగా ! ఈపోస్టుమేన్ ద్వారా ! Thru this winged messenger of Heaven.

మ:—(తత్తరపాటుతో, అదటుతో, మాటతడపడే తొట్రిపాటుతో, ఆ లెటర్ నలిపివేసి, వెనక్కి దాచిపెట్టి) క్షమించాలి ! నే అన్నముక్కలు నావికావు...'రోజ్' ఇల్లాఅందని ఒకప్పుడు విశ్వనాథ్ చెప్పాడు! నావికావు!

జు:—(నిదానించి) దానికేం ! ఎవరన్నా అనవచ్చును ! సహజంగానేవుంది ! సరిగ్గా ఆవలించకుండానే ప్రేగులు లెక్కపెట్టే వాడిదగ్గర ఇల్లాంటివి మసిపూసి మారేడికాయచెయ్యడం మానవమాత్రుల కసాధ్యం ! చాలా కష్టం !

మ:—(భీతహరిణివోలే తల్లడిల్లుచు చూచును)

జు:—మధూ! నన్ను విశ్వసించు! నేనుస్నేహపాత్రుణ్ణి! ప్రేమ్జీ నాకు అంతరంగిక మిత్రుడు. నువ్వు నా సోదరిలాంటి దానవు; విపరీతపరిస్థితుల్లో ఆదుకొనేవాడే హితుడు. రెండోకంటికి తెలియకుండ అందజేస్తా ! సందేహించకు ఆ టపాకట్టేవాళ్ళు, టపామోసేవాళ్ళూ వేరులే ! మీ ఆనందమే నా మహదానందం ! ఇల్లా ఇయ్యమ్మా !

(మధురం చేతిలో వణుకుతూవున్న లెటర్‌ని జలు అందుకుని నిష్క్రమించును.)

(మధురం ఆలోచనానిమగ్నమై వుండగా
జానకిరామ్ ప్రవేశం)

జా:—మధురం ! అమ్మా ! ప్రేమ్జీ చాలా.........

మ:—(ఆతృతతో) ప్రేమ్జీ ఏంచేశాడునాన్నా !

జా:—అబ్బే ! ఏమీ చేయలేదమ్మా ! చాలాబుద్ధిమంతుడు; నీకు తగినవరుడని అంటున్నా-లేదు...అనుకుంటున్నా.

మ:—ఎందుకు నాన్నా! మీరు కూడా ఎగతాళిచెయ్యడం !

జా:—నిజంగానే అంటున్నా. ఇప్పటికైనా ప్రేమ్జీనిచేపట్టి...

(జానకి మాట పూర్తికాకుండా మధురం తలవంచి కాలిబొటన వ్రేలుతో నేలగీయుచు, ఒప్పుదల సూచిస్తూ నిష్క్రమించును)

జా:—వెర్రిపిల్ల! అమ్మయ్యా! భగవంతుడా! నీ లీలలు అమోఘములు ! ఓహో ! ఘటన ! ఘటనకు ప్రతిఘటన ఈ లోకాన లేదు! ఈ విశ్వవిశ్వంభర చక్రాన్ని శాశించే రాజాధిరాజులు నీగులాములు.

(జానకిరామ్ నిష్క్రమి తెర.)

---

ద్వితీయరంగము.

[స్థలం:—స్వేచ్ఛాప్రణయసంఘం- ఏకాంతంగా ప్రేమ్జీ పేపరు చూస్తూవుంటాడు; శ్రీమతి రోజ్ ప్రవేశంలో జోడు చప్పుడుచేస్తుంది; ప్రేమ్జీ చూసీ చూడనట్టు నటిస్తాడు; రోజ్,



చేతనున్న చిరుముళ్ళ గులాబీపూలగుత్తితో ఖాళీఫ్లవర్ వేస్ అలంకరిస్తుంది! ప్రేమ్జీ ఆమె సౌందర్యాన్ని ఉపాసిస్తూ, పరధ్యానంతో ఆ పూలగుత్తిని నిమురగా, ముల్లుగుచ్చుకుంటుంది.]

ప్రే:—(తియ్యని బాధనటించి) అబ్బా! - నీపేరింటి రోజ్ అమ్మాయిని తదేకదృష్టితోచూస్తూ, నిన్ను చూడనన్నా చూడలేదనే కోపంకొలదీ నన్ను నీ సునిశితమైన ముల్లుతో సున్నితంగాగుచ్చావా! వెర్రిదానా! నీకే ఇంత ఈర్ష్యవుంటే సాటిస్త్రీల కెంతవుండాలి ... ... దేవిగారు కొడతారుసుమా! అట్టే అల్లరిచెయ్యకు.

రో:—(హాస్యాస్పదంగా) పూర్వం చెట్లు, చేమలు, పక్షులు మనుష్యభాష మాట్లాడేవి అంటే ఇంకాఏమిటో అనుకున్నాను. ఈమాటు నమ్మవలసివస్తోంది. ప్రేమోపాసకులకు సర్వం పలుకుతాయి! ఆఖరికి మార్గంలో వల్లేరుకాయలుకూడా పలుకరిస్తాయి!

ప్రే:—(మందహాసంతో రోజ్‌ని సమీపించి) అబ్బా! ప్రేమమయీ! ఎన్నాళ్ళకి నీ సందర్శనభాగ్యం లభించింది! (ఆమె దూరమగును) చిరునవ్వుచిరుకాడే ఈపెదవులు! (రోజ్ పెదవివిరచును) లేమెరుంగుల గులాబీచెక్కిళ్ళు! (గులాబీపూవుతో ఆమె బుగ్గను తట్టుకొనును) అనంత తారకాద్యుతితో దేదీప్యమానంగా వెల్గులను వెదజల్లే ఈ తేజోపుంజం! కాంతికల్లోలినీ! ఏమి నీ అంగసౌష్ఠవము - నువ్వు నా మధురమూర్తివి-నా ఇలవేల్పు!

రో:—(సీరియస్‌గా కనుబొమ్మలు ముడివేస్తూ, కిట్టనిచూపులు ప్రసరించును.)

ప్రే:—(ప్రాధేయపూర్వకంగా) నా ప్రణయ సామ్రాజ్యానికి పట్టమహిషివి! ఆరాధ్యదేవతవి రోజ్! ఆ అనంతాకాశంలోకి ఆ అమరసౌధానికి గువ్వపిట్టల్లా ఎగిరిపోదాం పద! (చెయ్యిపట్టుకొనగా, ఆమె మెల్లగా విదలించుకొనును.) నా హృదయానికి రెక్కలొచ్చిఎగురుతోంది! చూడు! ఆ ధృవనక్షత్రం దరిదాపున ఎగసెడివెలుగే మన ప్రణయజ్యోతి!

రో:—(మొరటువలె పెడమొహంపెట్టి, పుస్తకం తిరుగవేయును)

ప్రే:—పలుకే బంగారమా? డియర్ రోజ్! వికాసంలేదే నేడు. నేను నిన్ను ఎంతో ఇదిగా గాఢంగా ప్రేమించా!

(చెవిలో చెప్పగా ఆమె దూరమగును) నా హృదయం నీ స్పందనకై తహతహలాడిపోతోంది! ప్రేమ అగాధా! సుడిగుండంలోనా పారెయ్యడం ?

రో:—(ఘాటుగా) అయిందా ? రేడియో ఉపన్యాసం ! మీరు మాట్లాడేదేమిటో నాకు బోధపడటం లేదు. ఓం ప్రథమంలో పరిచయం - పరిచయమల్లా స్నేహమయింది; స్నేహం బాంధవ్యంగా మారుతోందా... అన్నట్టు కనిపిస్తోంది.

ప్రే:—మై క్లియోపేట్రా ! మై రోజ్ ! మై క్వీన్! చెప్పవూ? చెప్పవూ? నీ నిగూఢసంభాషణ నన్ను ఖూనీ చేస్తోంది! నిష్కారణంగా చంపెయ్యకు-అనుగ్రహించవూ.

రో:—(హృదయపూర్వకంగా) పెళ్ళి అయితే ఈ స్వేచ్ఛా, ఈ హాయీ వుండవు. బందీనౌతా ! వ్యక్తిత్వం వుండదు.

ప్రే:—(ఆనందంతో) వ్యక్తిగతభేదం వుండదు ! మన భౌతిక దేహాలుమాత్రమే వేరు. అంతే ! ఒకేహృది-ఒకే ఆత్మ లీనమైపోవాలి ! ప్రేమోపాసకులమై తీయని వలపువిరలతో ప్రేమార్చన మొదప్పుదామ్ ! మన జీవితాలు నీ రాజనంగా నివ్వాళించువాము ప్రణయాధిదేవతికి !

రో:—పెళ్ళయితే మన స్నేహలత చిగర్చదు-వాడిపోతుంది.

ప్రే:—(ఉద్రేకంతో) లతాకుంజాలకు సూర్యరశ్మి ఎట్టిదో మన స్నేహలతకి 'ప్రణయరశ్మి' అట్టిది ! రోజ్ ! మానవమాత్రుల జీవితాశయం నిత్యకల్యాణం ! ప్రేమ చరమలక్ష్యం, వివాహం !

రో:—వింతగావుందే వివాహమే జీవితలక్ష్యం అనడం ! నమ్మబుల్ కాదు !

ప్రే:—ఎందుకుకాదు. హైలీ నమ్మబుల్ ! . ఎంచేతంటావా నిజంగా ఆలోచిస్తే యువతీయువకుల ప్రేమ వివాహాన వికసించి జీవితకల్యాణాన్ని చేకూరుస్తుంది ! అంతేనే కాని, ప్రేయసీ ప్రియుల అవ్యాజప్రేమవాహినికి పెళ్లి ఆనకట్టు-అంతరాయం ఎన్నడూ అవదు !

రో:—పెళ్లితో స్త్రీ సి. క్లాసు ఖైదీ-కఠినవరకాన్ని అనుభవించాల్సుంటుంది. హృదయవైశాల్యాన్ని, బుద్ధివికాసాన్ని నశింపజేసే జన్మఖైదు పెళ్ళి !

ప్రే:—మరొకమాటు ఆలోచిస్తే విశదమౌతుంది !

రో:—దానికే మరొకమాట శుభప్రదంగా పెళ్లి అంటారు.

ప్రే:—చాలా పొరబడుతున్నావు సుమా! ఇంతకీ ఆలోటు నీది కాదు. నువ్వు అలవరచుకొన్న విజ్ఞానానిది. పాశ్చాత్య భావవ్యామోహపు తళకులకు మురిసి, అనంతమైన

భావదాస్యతకు లోనాడంచేతనే ఇల్లాంటి దౌర్భాగ్యస్థితికి కారణమయింది.

రో:—మీబోటి ఆదర్శవాదులే ఇలా సెలవిస్తే ఇంక సామాన్యులవిషయం వేరే చెప్పాలా! దానిమాటకేంగాని ఈమధ్య మధురాన్ని మీాటయ్యారా?

ప్రే:—(వ్యంగ్యంగా) లేదు! డైరెక్టర్ విశ్వనాథ్‌ని కలుసుకున్నా. డైరెక్టర్‌గారి మైసూరు విజయదశమి టూర్ ప్రోగ్రామ్ ఏమయిందో?

రో:—అయిన టూర్ సంగతి నాకేం తెలుస్తుందని అడిగారు. వారి ప్రయివేటు శెక్రటరీకి తెలుస్తుంది.

ప్రే:—నువ్వు అంతకన్న ఎక్కువదానవే! ఎంత ఇది లేకపోతే డైరెక్టరతో వనవిహారం..........

రో:—ప్రేమ్జీ! కట్టిపెట్టు! నీ ప్రావిన్స్‌దాటి, అనవసర విషయాలలో జోక్యం కలుగజేసుకొని, నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నావ్! ఒక స్త్రీ నీతో సంభాషిస్తోందనే సౌమ్యతని కూడా గుర్తించలేకపోయావ్!

ప్రే:—ఏమిటీ! నా ఎదుటనున్నది ఒక స్త్రీమూర్తా! చెప్పేవరకు తెలుసుకోలేకపోయానే-ఎంతటి మూర్ఖుణ్ణి! నా మనోవీధిని అప్సరసచే నాట్యం కట్టించపోయి కోతిపిల్లను గెంతించాను...ఆ తప్పు నాదే! ఇంకెవరిది?

నాజీవయాత్రలో తప్పటడుగులు వేశాను. వెలుగేమో అనిభ్రమసి చీకటిని సమీపించా! సౌందర్యాన్ని ఉపాసించపోయి వివర్యాన్ని, శూన్యాన్ని ఆరాధించా! (రోజ్‌నుద్దేశించి) నీలో ఉన్నదంతా గభీరమైన ఔన్నత్యమని విశ్వసించి అంతులేని అగాధంలో కూలిపోయా! కృంగిపోయా! నా కళాప్రపంచంలో నిన్నొక ఆదర్శ ప్రేయసిగా పరిగణించి నీ నీచత్వానికి, అల్పత్వానికి దాసోహం అన్నాను. ఏయ్! రోజ్! ఇన్నాళ్ళనుండీ ప్రేమించినది నిన్నుకాదు-నీ స్త్రీత్వాన్ని అంతకంటె కాదు! ఆ అమరశిల్పి నీ మూర్తిలో నిర్మించిన అతిలోకసౌందర్యతని! ఆ మధురపరిణామాన్ని!

రో:—చాల పొరపాటు జరిగిపోయింది!

ప్రే:—బుద్ధిపొరపాటు ... ... ...

రో:—(విజృంభించి, నిట్టూర్పుబుసలుకొడుతూ) కాకపోతే అనుమానం, నిర్బంధం, ఎందుకొస్తాయి! తోటి స్నేహితులతో షికారువెళ్తే 'ఎక్కడికి - ఎందుకు' అని ప్రశ్నలా? నా ఆనందానికి అంతరాయం కలిగితే నే సహించగలనా? ఎవరుమాత్రం భరించగలరు! ఇదేనా తమరి ఎఫ్. ఎల్. సొసైటీ కార్యదర్శిత్వం? స్వేచ్ఛాప్రణయం 'ఓ' అంటే 'ఢం' తెలియదుకాని సెక్రట

రీట ! సెక్రటరీ ! రామరావణ యుద్ధంనాటి బూజు-అభిప్రాయాలు నశించకపోతే ఎల్లా బాగుపడుతుందీ-దేశం ?

ప్రే:—దివ్యసందేశం !

రో:—(రష్యావాతావరణంలో లీనమై భావైక్యతచెంది) రష్యా! స్వేచ్ఛాప్రణయసంఘాలకు పుట్టినిల్లు ! ఆ స్వేచ్ఛా, ఆ ప్రణయం ఏమనిచెప్పను ! సముద్రాలు, పర్వతనదీ నదస్రవంతులు ఉన్నాయి; గాలివుంది-అది ఒకరిసొమ్మా? ప్రకృతిలోవుండే ప్రతీవస్తువులోని రమ్యతనీ, సౌందర్య శోభనీ, ప్రతీవ్యక్తీ ఆస్వాదించవలసిందే ! చందనపరిమళం వుందంటే ఆసువాసనా, సౌరభ్యం, ఒక్కరిదేనా? అంతా ఆఘ్రాణిస్తున్నారు. పూసుకున్నవారొక్కరే కాదు ! ప్రకృతిశోభ సందరూ అనుభవించటం లేదూ ? సౌందర్యం అనేది ఒకరి అబ్బసొమ్మా? ప్రేమ్జీ! గుడ్ బై !

(శ్రీమతి 'రోజ్' చర,చరా, నిష్క్ర.)

ప్రే:—(కోపోద్రిక్తుడై, విజృంభించి) ఏమిటీ ? సౌందర్యం ఒకరి కాపీరైటుహక్కు కాదన్నమాట ! స్వేచ్ఛాప్రణయం అందరి ఉమ్మడిసొమ్మన్న అని 'రోజ్' కాదు 'బ్రూజ్' అభిప్రాయం ! ఎంత బరితెగించిపోయిందీ ! స్త్రీలోవుండే సహజమార్దవం, నమ్రత చచ్చిపోయాక

ఇక స్త్రీ ఏమిటి - స్త్రీత్వమేమిటి? 'మగదే' ముమ్మా టికినీ! రోజ్! ఇప్పటికి నీ నిజవిశ్వరూప సందర్శన భాగ్యుడనయ్యా! ప్రేమోపాసకులపాలిటి పొటేసియం సైనేటులా దాపరించావ్! నారీరూపాన్నవతరించిన భయంకర రాక్షసి! నవనాగరికతాభ్యుదయం అంటే ఇదా? 'India & the East' అంటే హైందవ సాంప్రదాయం, ప్రేమపరిణతికి, సాంసారికజీవనాదర్శా నికి, ఆధ్యాత్మికఔన్నత్యానికీ జోహారు చేస్తున్నారు, పాశ్చాత్యులు! దేశదేశాలకు ఆదర్శరమణి భారత రమణోగా! హైందవసాంప్రదాయం పాలిటి మొసలం లా దాపరించావ్! రోజ్! ఇదిగో నా రాజీనామా! స్వస్తి! జగత్రయీభువన, స్వేచ్ఛాప్రణయసంఘ శార్దూలాలకి! స్వస్తి! జగత్రయీభువన భయంకర నారీపిశాచాలకి (వెర్రి ఉద్రేకంతో, క్షణికమాత్రపు టున్మాదంలో వికటంగా Tragic smile నవ్వి, వెన క్కు వెళ్ళి కుర్చీలో కూలబడి, టేబిల్ మీద రోజా పువ్వు తీసి కర్కశంగా చూస్తూ) రోజ్! నీకూ మూళ్ళు న్నాయ్! (పువ్వు పారవైచి పచారుచేస్తూ చూడ కుండా దానిని కాలితో మట్టివేయును; అంత మిస్టర్ జాలు గులాబిరంగుకండువా సర్దుకుంటూ ప్రవేశించి)

జు:—ఆ! దట్టంగా! ... ... గుడ్ నైట్! ప్రేమ్జీ!

ప్రే:—గుడ్ నైట్ కాదు! ఇహ నాకు కాళరాత్రే! ఇక ఏమనుకుంటే ఎందుకు!

జు:—ఏమిటో స్వస్తివాచకా లెగరగొడుతున్నావ్! కథ అడ్డం తిరిగిందేమిటి?

ప్రే:—(భావగర్భితదృక్కులు జులువైపు ప్రసరిస్తూ, అతని భుజముపైనున్న రోజారంగు కండువా చూసి, భయోత్పన్నుడై, అంటీ అంటకుండా చేతితో తీసి) ఘోరం! ద్రోహం! మోసం! రోజ్! (ఆకండువాని ఫుట్-లైట్సుకేసి విసరివేయును)

జు:—(ఆశ్చర్యచకితుడై నవ్వి) బెనురుగొడ్డుకి ఎరుపురంగు, మా ప్రేమ్జీకి రోజారంగు!

ప్రే:—రంగు తేలింది! వెలిసిపోయింది!

జు:—(హాస్యంగా) ఓహో! మెరుపుతీగ! ఉజ్వలతార! మధురమూర్తి! సుహాసిని.........గానకోకిల ఏమయిందీ? ఫైలు ఎక్కువయిందా?

ప్రే:—మెరపుతీగ కనుక నే రెప్పపాటులో ఒక్క మెరపు మెరసి లేచ్చక్కాపోయింది; సుహాసిని, సుభాషిణి, సుమాలిని అల్లాపోయి, విశ్వాసఘాతికీ, భూతకీ, తాటకీ ఐపోయావ్! రోజ్!

జు:—ఇప్పటికైనా తెలిసొస్తేపరవాలేదు! ఈ ప్రాపంచికోద్యానవనసీమల్లో ఇన్నికోట్ల పుష్పాలుంటే, ఈ 'రోజ్' ఎక్కడ దాపరించిందిరా, నాయనా! నీప్రాణాంతకానికి...... 

ప్రే:—సమయానికే తటస్థపడ్డావ్! విను రోజ్ నా శోకగుణపాఠం నేర్పింది; నాజీవనలతనుండి ఒకపత్రమిదిగో! జీవితసందేశం!

జు:—అబ్బో! ప్రవక్త Lord Buddha! మూడుమూర్తులా శుద్ధబుద్ధావతారం!

ప్రే:—అబ్బా! చచ్చినవాడి నింకాచంపకు; ఆదర్శజీవుల ఆశయాలకు ఈప్రపంచంలో తావులేదు! వాస్తవికజగత్తులో నగ్నప్రేమ, సత్యాలకు స్థానంలేదు! ప్రపంచం వాటిపై ఆంక్షవిధించింది! ఏ వస్తువునైతే, జీవితపరమావధి అంటూ ప్రాకులాడుతామో, అదిలభించకపోవడం సరేకదా, వార్ని హతాశులజేసి, భావిజీవితకళ్యాణానికి గ్రహణం ఆపాదిస్తుంది! జాగ్రదావస్థలో పడాలి.

జు:—అల్లారా! అదీదారి! ప్రేమ్జీ! జీవితసంగ్రామంలో విషాదాఘాతాలకు గుండె ఎదురొడ్డి, ధైర్యసాహసాలతో జీవయాత్రసాగించి, జీవితమధువును 'కాలపాత్ర'నుండి

కాదు-'మధూ-పాత్ర 'నుంచి గ్రోలవోయ్ ! ఇదుగో--
మధురం నీకిచ్చిన ఉత్తరం ! (అందిచ్చును)

ప్రే:—(ఆశ్చర్యంతో,అందుకొని)మధురం! ఉత్తరం! నాకు...

జు.—ఆ ! మధురం ! ఉత్తరం ! నీకు.........

ప్రే:—(ఆతృతతో ఉత్తరం చదివి విషాదాన్ని ప్రకటిస్తూ)మధురం ! నే రాకపోయినచో—ఆత్మ—హ—త్య ! (బిగ్గరగా) ఆ—త్మ—హ—త్య ! (తొందరగా) ఆత్మహత్య ! హంతకుడను నే నౌతానా ! మిస్టర్ జులు ! కర్తవ్యం ఏమిటి ? పులిమీద పుట్రలావచ్చి పడిందే !

జులు:—(గ్రహించి,తాపీగా ఇటూ, అటూ ఆలోచిస్తూపచారు చేస్తుంటే ప్రేమ్జీ అతనివెంట పడతాడు)నేను అల్లాంటి దేదీ జరగకుండా వెంటనేవెళ్ళివస్తా'!

ప్రే:—జాగ్రత్తసుమా! ఎంతమాత్రం ఆలస్యంచేసినా మనం నష్టపోతామ్ !

జు:—(నిష్క్రమిస్తూ) అంతతీపా—ఆ మధురనామం ! (జులు నిష్క్రమణ)

(అవి కంటకక్షణికాలు!ఒకచో మొదటనుంచీ ప్రేమించి ఆరాధించిన రోజ్ ప్రేమ్జీపట్ల మోసం; వేరొకచో మధురం భీషణ ఆత్మహత్య ప్రతిజ్ఞ వార్త! అపుడు విషాదాన్ని ధ్వనించే గానం వినిపిస్తుంది; ప్రేమ్జీ తదనుగుణ్యంగా నటిస్తాడు.)

అవనికాంతర గానం.

1. మానుమా ! మానుమా ! మానుమా !

ఈ విషాదగీతిని నిముసమాత్ర జీవితసంగ్రామానా॥

2. విడనాడుమా ! స్త్రీప్రేమగాథా !

... ... ... ...

ప్రే:—(భావతిమిరంలోంచి మేల్కాంచి) ప్రేమకొక భావం లేదు -నిరసనభావంతప్పితే; ఒక భాష లేదు - అంతా దుర్భాషే ! లక్ష్యం నిర్లక్ష్యం ! ప్రేమ మహాప్రవాహంకాదు—అడ్డంకుల ఆలవాలం! తుమ్మెద ఝుంకారాన్ని ఎరుగని పువ్వు—పువ్వుకాదు! ప్రేమపిపాస నెరుగని జీవితం—జీవితంకాదు ! అనాధజీవితం !...ఓ ! అదృశ్యమహాశక్తీ! ప్రకృతికాంతామతల్లీ! విశ్వప్రేయసీ! నా హృదయరక్తం వెల్గించి హారతు లందిస్తున్నా ! స్వీకరించమని ప్రార్థిస్తున్నా ! (అపుడు మధురం నయభయాలతో ప్రవేశించి కుర్చీని తట్టి, పూలతో ప్రేమ్జీని వెనుకనుండి పల్కరించును; ప్రేమ్జీ అదరుపాటునొందును.)

ప్రే:—(రోజ్ మరలవచ్చిందనుకొని) ఏయ్! రోజ్ ! విశ్వాసఘాతకీ ! ఛీ ! అవతలకిపో! నీ మొహంచూడను! మళ్లీ దాపరించావ్! (అని వెనక్కితిరుగును......మధురమని

గు_ర్తించి, ఆమె చేతులుపట్టుకొని) క్షమించు ! ప్రేమమయీ! మధురా ! నీ ముఖకమలం చూచినంతనే, నేను నీకు బహూకరించిన ముఖచిత్రం జ్ఞప్తికి వస్తోంది! ఔను నా కాన్కఏదీ ?

మ:—(తత్తరపడి) కాన్కా! వుంది; లేదు! లేదు—ఐనా, నే వుండగా వేరేకాన్క ఎందుకూ?...నా...హృదయమే

ప్రే:—(సత్యాగ్రహంతో) ఫొటో ఏమయింది! ఏం చేశావ్ ! మధురం !

మ:—ఏమీ చెయ్యలేదు—ప్రేమ్జీ ! కనిపించటం లేదు.

ప్రే:—కనిపిస్తోంది ! నాకు ప్రబలనిదర్శనం కనిపిస్తోంది ! ప్రత్యక్ష నిదర్శనం !

మ:—(కంగారుతో, తొట్రుపాటుతో) ప్రేమ్జీ!ఆ-ద్రో-హి.

ప్రే:—(కోపాతిరేకంలో)నీ పేరు 'మధురం'కాదు! 'కాఠిన్యం'! శిలాప్రతిమకన్నా హృదయం వుంటుంది - వుంటుంది ! అబ్బా! స్త్రీ హృదయం అగమ్యం! దుర్భేద్యం! పూజ్యం కూడా. స్త్రీ హృదయాన్ని ఊహించేటందుకు ఏమంత్రమూ తంత్రమూ పనిచెయ్యవు... ... ...

మ:—(బేలయై) ప్రేమ్జీ! నే నేమీ ఎరుగను-నిరపరాధిని...

ప్రే:—నువ్వు చేసుకోదలచినది ఆత్మహత్యేనా ?

మ:—ఔను......కాదు - మరీ.........

ప్రే:—కాదు! నువ్వొక విశాలహృదయాన్ని, సున్నితంగా, ఆదర్శనీయంగా హత్యచేశావ్!

మ:—నేనా? నేను......

ప్రే:—(శూన్యంగా) ఔను! నువ్వే! ముమ్మాటికీ నువ్వే! నువ్వన్నమాటేమిటీ? ఈప్రపంచమే, ఈజీవితమే - ఒక శూన్యమాత్రిక! అంతా నిరాశ! మోసం! అడుగడుగునకూ, ద్రోహం వెన్నంటి తరుముతోంది-విశ్వాస రహితం! విశ్వాసశూన్యం!

మ:—నీలో-విశ్వాసంపోలేదు! ప్రేమ్జీ-అన్యాయంగా-

ప్రే:—లేదు-పోలేదు-ఉన్నాను! భగవంతుడా! స్త్రీలో నిబిడీకృత అగ్నిపర్వతాన్ని ప్రజ్వలింపచేసిన నీ శక్తి ఏమనాలి?

మ:—(తీక్ష్ణంగా, రుద్ధకంఠంలో) ప్రేమ్జీ! ఆలోచించు! దూరదృష్టితో ...... నిలకడమీద నిజం తేలుతుంది; ఎప్పుడూ రెండు బలీయమైన మహత్తరశక్తులనడుమ-అమాయకులు, నిర్దోషులు - అన్యాయంగా ఆహుతి ఐపోతారు!

ప్రే:—(వికటంగానవ్వి) ఇది స్మశానవైరాగ్యంలాంటిది; ప్రేమ సన్యాసానికి ముందుగావచ్చే మెట్టవేదాంతం! నాకు స్త్రీ అనే పదంలో, వ్యక్తిలో, జాతిలో విశ్వాసంలేదు!

పోయింది ! నశించింది ! స్త్రీ మాయాస్వరూపిణి !
మానవజాతి పాలిటి మారణయంత్రం ! ఛీ ! ఛీ !

(జులు ప్రవేశం:)

జు:—ప్రేమ్జీ ! ప్రేమ్జీ ! మధురం ఇంట్లో లేదు- ఏ ప్రమాదమో...(కర్టెనులోంచి అకస్మాత్తుగా ప్రవేశించి, మధూ ప్రేమ్జీల చూచి, ఆశ్చర్య విషాదములతో) ప్రేమ్జీ ! ఏమిటీ అన్యాయం ! ఆ వైఖరి ! మధురం అమాయకురాలు !

ప్రే:—జులూ!-అమాయకురాలు! మాయామాంత్రికరాలు !

జు:—ఆమె నిర్దోషి ! హంతకుడు, ఆ డైరెక్టర్ మానవుడు ! వాడి కుతంత్రం, పన్నాగం సాగలేదు- కాని... ...

ప్రే:—కుతంత్రమా !

జు:—ఔను; నీ ముఖచిత్రాన్ని దొంగిలించి, మీ పవిత్ర ప్రేమను భగ్నం చేసి, గ్రంధం నడిపి ఆనందిద్దామనుకొన్నాడు. ... ...

ప్రే:—ఆ ! ఏమిటీ ! డైరెక్టర్ విశ్వం ... (మధుకేసి తిరిగి ఆమె చేతులు పట్టుకొని) మధూ ! క్షమించు ఈ అపరాధిని......నిన్ను ఎంతో కఠినంగా అనరానిమాటలాడి తూలనాడాను ! బాధించా ! హింసించా ! అందుకై నీ వేశిక్ష విధించినా సంతోషంతో భరించి, అనుభవిస్తా !

మ:—(తలవంచి అర్ధోక్తిలోనవ్వును.)

జు:—ప్రేమ్జీ ! నువ్వు ఆమెను నిందించినందుకు, శిక్ష ఏమిటంటే ఆమెస్నేహానికి నువ్వు స్వస్తిచెప్పాలి !

ప్రే:—ఆ! చిత్రం ! తమరు- 'లాయర్ జులూ'గారు వకాలత్ పుచ్చుకున్నట్టున్నారు.

జు:—ప్రేమ్జీ ! ఈ గరమ్ గరమ్‌వార్త విన్నావా ?

ప్రే:—ఏమిటీ ?

మ:—(ప్రశ్నార్థకంగాచూచును)

జు:—ఆ రోజ్ ! కాదు ! ఆ గణాచారి, నీ ఊహాలవుట్టీ-శ్రీమతి- డైరెక్టర్ విశ్వనాధ్‌తో మలబారు ఉడాయించింది !

ప్రే:—పలాయన మంత్రమే ? ఎంతపనిచేసిందీ ?

జు:—ఆ ! తెగేసి ! అయితే ప్రేమ్జీ ! (మధునుద్దేశించి వ్యంగ్యంగా) 'ఈ మొగాళ్ళ నిరంకుశత్వానికి బలికాను.'

మ:—(నవ్వి తలవంచుకొనును)

ప్రే:—(భావగర్భితంగా) 'పెళ్ళి మాత్రంవద్దండీ'

జు:—పాపం ! పోనీలెండి కాని, ఇప్పటికైనా ఆదర్శభారత రమణి ఎవరో తెల్సిందా ?

ప్రే:—('మధు' అన్నట్టుసూచించి) ఇంకా తెలియకపోవాలీ !

జు:—ప్రేమ్జీ! 'భావసమాధి' చాలించి, నీ ఆకాశవీధుల్లోంచి ఊహాసౌధాగ్ర భాగాలనుండి, తాపీగాదిగి,

వాస్తవిక జగత్తులోపడి మనుష్యప్రపంచంలో మసు
లుకో !

ప్రే:—అయ్యో ! అవస్యం !

(ప్రేమ్జీ మధురములు దగ్గరగానిల్చుని ప్రేమవీక్షులు మార్చుకొనుచుందురు; జానకిరామ్ కంగారుగా, కండువా క్రింద జారిపోతూ, ఒక్కుమ్మడి పరుగున ప్రవేశించును)

జా:—చిట్టితల్లీ ! నాభాగ్యలక్ష్మీ ! ఇక్కడవున్నావా !

(మధురాన్ని దగ్గరకు తీసికొని, ఆమెతలను పితృవాత్స ల్యంతో నిమురుతూ ప్రేమ్జీ మధురముల, చేతులు కలిపి) మీరు ఆజన్మాంతం ఈ పవిత్ర వివాహబంధాన్ని ఆచరించి, ఆదరించి ఆదర్శదంపతులై జీవయాత్ర సాగించండి ! కళ్యాణ మస్తు ! శుభమస్తు ! ప్రేమ్జీ, మధులు జానకిరామ్‌నకు నమ స్కరించి జులుపాదములకు ప్రణమిల్లుదురు)

జు:—(ప్రేమ్జీని లేవదీస్తూ) ఆదర్శదంపతులు! శుభస్యశీఘ్రం!
'పెళ్ళొద్దు-పెళ్ళొద్దు' సు-పుత్రికారత్నాలు అరడజను
మాత్రమే ప్రాప్తిరస్తు !

[సంతోషకరమైన బేక్ గ్రౌండ్ మ్యూజిక్‌తో, మంగళానందగీతితో తెరచెంగు చెంగున నృత్యభంగిమాలతోపడును.]

ప్రణయసామ్రాట్,

సమాప్తము.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B123 |
| పుస్తకం పేరు | ప్రణయసమ్రాట్ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 134 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |